

# కొత్త అల్లుడు

కొడవటిగంటి కుటుంబరావు

నవోదయ పబ్లిషర్సు
విజయవాడ 2




ప్రథమ ముద్రణ
జనవరి 1962
ద్వితీయ ముద్రణ
సెప్టెంబరు 1963
ప్రచురణ నెం.71

వెల రు 3-50



అచ్చు : "వెంకటరత్నా"

హనుమాయమ్మ ఒక బొక్కెన తీసి రెండో బొక్కెన పంపు క్రింద పెడుతూ "మా పెద్దకోడలు కాపరానికొచ్చినప్పుడు కాస్త ఊపిరి సలుపుతుంది గదా అనుకొన్నా ! ఇటు పూచికపుడక అటు పెట్టేదికాదు జానికమ్మోవ్! కాస్త వంట గది ఊడ్చి పీటలు వెయ్యవే అంటే చీపురు నన్ను తెచ్చి ఇవ్వమనేది. ప్రతిరోజూ ఝాంప్రొద్దెక్కి లేచేది. అదేమిటే అంటే అర్ధరాత్రిదాటి నిద్రపోయినానననేది!"

హనుమాయమ్మచేసిన అభినయానికి జానకి నవ్వింది.

"అయిందా; రోజూ సాయంత్రం షికారు వెళ్ళేది మొగుడితో. షికారుకాకపోతే సినిమా, సినిమా కాక పోతే బీచి, అదీకాకపోతే పార్కు - బతికిన కాలేజీ, చచ్చినకాలేజీ, నా వల్లకామా, నా వసివి కాడూనా ! వెళితే వెళ్ళింది. చీరె మార్చుకుని విడిచిన చీరె కాళ్ళతో ఏ మంచంకిందకో, బల్లకిందకో తన్నేసేది. అది వెళ్ళగానే అది విడిచిన చీరె ఎక్కడ పొర్లుతున్నదో నేను చూసి మడిచిపెట్టాలి! ఇంటికి తిరిగొచ్చి "నా చీరె ఏదీ ? నాచీరె ఎవరు తీశారు ? ఎక్కడ పెట్టారు? ఈ ఇంట్లో ఏవస్తువూ పెట్టినచోట ఉండదేం!" అని చిందులుతొక్కేది. అది మంచంకింద పొర్లుతుంటే నేనే తీసిపెట్టానని చెప్పాననుకో, మానుషం వున్న మనిషయితే సిగ్గుపడి తల వంచేసినట్టు అయిపోదూ? ఊఁహూఁ! నామీద విసుక్కునేది. మంచం కింద వుంటే దానికి జలుబుచెయ్యదట ! నాకు

గుర్తుగా మంచం కింద పెట్టుకుందట! దాన్ని మడిచి ఎక్కడో పెట్టి ఆసీమశాణిగారికి నేను అనవసర శ్రమ కలిగించానట. వింటున్నావా జానకమ్మతల్లీ! వాళ్ళు పూనా వెళ్ళాక నా ప్రాణం సుఖానపడిందనుకో! చాల్లేఅమ్మా, నీ పని చూసుకో. నన్ను మాట్లాడనిస్తే ఇట్లాగే మిట్ట మధ్యాన్నందాకా మాట్లాడుతూనే ఉంటా. నా గోడ ఆరేదీ, తీరేదీ కాదులే!"

హనుమాయమ్మ బొక్కెన ఇవతలికి లాగి, రెండు బొక్కెనలూ పట్టుకుని చాకిబండదగ్గరికి వచ్చింది.

"మీ అబ్బాయికి సమ్మంధాలు చూస్తున్నారుటగా?" అన్నది జానకి.

"చూస్తున్నానమ్మా, డజన్లకొద్దీ సమ్మంధాలు రావటంతో మాకు ఏ ఒకటీ కుదరకుండా ఉంది. నా చిన్నతనంలోనే నయం. ఒకటో రెండో సమ్మంధాలు వచ్చేవి. ఏదో ఒకటి నిర్ణయమయేది. నాకు చూసిందే ఒకసమ్మంధం, చేసిందే ఒక సమ్మంధం. ఈ కాలంలో అంతకంటె బాగా పెళ్ళిళ్ళు చేస్తున్నారా ఏంవిటి? మా పెద్దవాడికి ఇరవై సమ్మంధాలు చూసిచేశాం. ఏంవైంది?"

"అందరూ అలా ఉంటారుటండీ, పిన్నిగారూ? అత్తగార్లను కాలు కదలనివ్వని కోడళ్ళులేరూ?" అన్నది జానకి.

"ఎందుకుండరు జానికెమ్మతల్లీ! తప్పకుండా ఉంటారు. అటువంటి కోడళ్ళు నాకు రాసిపెట్టి లేరంతే. ఆ కోదండరామయ్యగారమ్మాయిని చూట్టానికి రేపో ఎల్లుండో

వెళ్ళేటప్పుడు నువ్వుకూడా వద్దువుగ్గానిలే!" అంటూ హను మాయమ్మగారు బట్టలు ఉతికేపనిలో పడింది.

హనుమాయమ్మగారు బట్టలుతికే విధానం చూచి తీరవలసిందే, జానక్కి అవతల పని ఉండటంవల్ల బిందె తీసుకొని చరా చరా వెళ్ళిపోయింది. కాని మనకు అర్జంటు పనేమీ లేదుగనుక నిలబడి చూద్దాం. హనుమాయమ్మ గారు బట్టలు ఉతుకుతున్నదనేకంటే బట్టలతో యుద్ధం చేస్తున్నదనటం సబబుగా ఉంటుంది. బట్టలు నిర్జీవ పదార్థా లని మన అపోహ. కాని హనుమాయమ్మగారి పట్ల అవి సజీ వాలుగా ప్రవర్తించడమేగాక ఆవిడకు గర్భశత్రువుల్లే కూడా ప్రవర్తించినై ! అవి చేసినపనులు అన్నీ ఇన్నీకావు. ఆవిడచేతిలోనుంచి జారిపడినై. ఒకదాన్ని ఒకటి గట్టిగా పట్టుకుని ఊడిరాకపోయినై. అంచులు కనబడకుండా దాచు కునైవి. రెక్కలు పడేటట్టు పిండి విదిలిస్తుంటే మళ్ళీ బూాక్కెనలో పడినై. పిండి పక్కనపెడితే మట్టిలోకి దొర్లినై. రెండుగా మడిచి విప్పి విదిలిస్తుంటే ఆవిడ తలనో, చేతులనో, నడుమునో గట్టిగా వాటేసుకొనైవి.

అసలే ఆవిడ పాపం ఒళ్ళు స్వాధీనంలేని మనిషి. ఒక నిమిషంసేపు వంగేసరికి ఊపిరితిత్తులు ముడుచుకుంటై. అరనిమిషం కూచుంటే కాళ్ళలోని రక్తం ప్రవహించటం మానేస్తుంది. నిలబడితే రక్తమంతా కాళ్ళకు దిగుతుంది. అందుకని ఆవిడ క్షణక్షణానికీ పోజులుమారుస్తూ,

ముక్కుతూ, మూలుగుతూ, "నీ నోరుబడా! నిన్ను వాలికలు చెయ్యా!" అని తిడుతూ వాటితో యుద్ధం సాగించింది.

బట్టలను వాలికలు చెయ్యటం కేవలం తిక్కకాదు. రోజుకు కనీసం ఒకటి రెండు బట్టలు ఆవిడ చేతిలో అంతో ఇంతో చినుగుతూనే ఉంటై.

జానకిఖాళీబిందెతో మళ్ళీవస్తూ, "అయితేపిన్నిగారూ! కోదండరామయ్యగారంటే మొన్న వచ్చినవారా, ఆదివారంనాడు వచ్చినవారా?" అంటూ పంపు దగ్గరబిందె పెట్టి పంపు పిడిమీద చెయ్యివేసింది.

"పేరు ఇంకోరులే. మైలాపూర్‌లో-అదేదో రామాపురమో, భీమాపురమో—"

"అభిరామాపురమేమో—"

"అదే ఎత్తు భారంపురం. అక్కడుంటున్నారుట. పిల్ల బాగానే ఉంటుందన్నారు. ఈ కాలంలో బాగాఉండని పిల్లలంటూ ఎక్కడున్నారులే! పౌడర్లూ, క్రీంవులూ, పాడూ, పచ్చిబద్దలూ పాంవుకుని, జారిజెట్లూ, నవిలానులూ కట్టుకుని రెండు జెడలూ, మూడు జెడలూ వేసుకుని...."

హనుమాయమ్మగారు అట్లా సూర్యుడికేసి ఒక్కసారి చూసి, గడియారం చూసిన దానిమల్లే తన పని గబగబా కానిచ్చింది, మాట్లాడేవిషయం మధ్యలోనే మానేసి.

జానకి రెండో బిందెడు నీళ్ళు లోపల పోసేసి మళ్ళీ వచ్చి బట్టలారెయ్యటానికి సహాయం చేసింది.

"చూశావా జానికమ్మా?, ఒక మనిషిచేస్తే ఘంట పట్టేపని ఇద్దరు చేస్తే పావుగంటలోనే అయిపోతుంది. మా చిన్నతనంలో అందరమూ ఒక చూరుకింద ఉండేవాళ్ళం గనక పనులు చకచక అయిపొయ్యేవి. ఇంటిపనులంటే ఇంత భయపడి వెరుగుదుమా ఎన్నడన్నా ? ఈ బట్టల బెడగ అయేవరకే ఈ పొద్దయితే, ఇంకా ఎంతపనుందో చూడు. పొయ్యికూడా రాజెయ్యలేదింకా" అన్నది హనుమా యమ్మ మిగిలిన బట్టలన్నీ జానకినే ఆరెయ్యనిస్తూ.

తనకు ఆయాసమూ,రొప్పూ తెప్పించే పనులు జానకి సునాయాసంగా చెయ్యటమూ, తనచేతిలో నిలవకుండా జారి కిందపడే బట్టలు చచ్చినట్టు జానకి చెప్పినట్టు వింటూండటమూ, ఆవిడ గమనించకపోలేదు. గమనించి చేసేదేముంది? తనజాతకం! ఒకరినని ఏం లాభం? ఒకరంటే బట్టలన్నమాట?

"మీ లక్ష్మి, మీకు వంటసహాయం చేయదటండీ పిన్నిగారూ ?" అన్నది జానకి ఆరేసిన చీరెను అంచులు సరిచేసి, తిరగా బోర్లా తిప్పిచూస్తూ.

"అదా....? ఇంకా నయం!" అని హనుమాయమ్మ గారు తన నోటికి తానే తాళం వేసుకున్నది. లక్ష్మి ఎవ రినో చూసి ముట్టుమైల ఇంట్లో కలపటానికి నాలుగేళ్ళ నుంచీ ప్రయత్నం చేస్తూనేఉంది. హనుమాయమ్మ హోరా హోరి పోట్లాడుతూనే ఉంది. కాని ఆ సంగతి జానకితో

అని ఏం లాభం ? ఆ మనిషి ఎప్పుడు వాకిట ఉండేది ఎవరికీ తెలీదు.

హనుమాయమ్మ గుండె ఝల్లుమన్నది. 'ఒకవేళ ఇప్పుడుముట్టయే ఉండేమో! బట్టలన్నీ ఆ రేసిందికూడానూ?" అయితే హనుమాయమ్మగారి మనసు ఆవిడ శరీరంలాగా కాకుండా ఆవిడ చెప్పుచేతల్లోనే ఉంది. ముట్టయిఉండదు అని ఆవిడ తనను తాను క్షణంలో నమ్మించుకుని తృప్తి పొందింది.

"ఈపూటకు రక్షించావు జానికమ్మతల్లీ! నేనయితే ఈ బట్టలు ఈపూట తెములకనేపోను!"

"ఈ భాగ్యానికేనా పిన్నిగారూ ! నమ్మకమైన పని మనిషిని పెట్టుకోండి, మీరీ యాతన పడలేరు" అంటూ జానకి లోపలికి వెళ్ళిపోయింది.

అందుచేత ఆవిడకు పెద్ద బెంగ పట్టుకున్నట్టయింది.

కాలేజినుంచి అట్లా బీచికి వెళ్ళి, బీచినుంచి ఇంటికి చేరుకున్న ముకుందుడు సంగతంతా విని మొగం చిట్లించాడు. పెళ్ళికొడుకు కుశాలరావును తన తల్లీ తండ్రీ వర్ణించిన వర్ణన వాడికి చాల బాధ కలిగించింది. ఒక మనిషిని—అందులోనూ తన యీడువాణ్ణి - పై పెచ్చు తన చెల్లెల్ని చూడవచ్చి, చూసి తృప్తి చెందినవాణ్ణి- ఏ రాక్ హడ్సనో అన్నట్టు వర్ణిస్తుంటే ముకుందుడుకి సెన్స్ ఆఫ్ ప్రపోర్షన్ కాస్తా పోయినట్టయింది.

ముకుందుడు కొద్దిగా తల్లి పోలిక. అయితే వాడికి అదృష్టమంటే భయంలేదు నిరాశాభయం. ఎవరన్నా ఒక పుస్తకాన్నిగాని,ఒక పిక్చర్నిగాని, ఒక మనిషి తెలివితేటలు గాని తెగమెచ్చుకుంటే వాడికి బాధకలిగేది. వాళ్ళమాటలు విని తను డిజప్పాయింట్ అయిపోతానని వాడికి చెడ్డభయం. తన జీవితమంతా అలా డిజప్పాయింట్ కావడంలోనే గడిచిపోయినట్టు వాడు వూహించుకొనేవాడు.

"నేను చూసి గాని నమ్మను!" అన్నాడు ముకుందుడు.

"నువు చూసినా అంత అందంగానే ఉంటాడులే!" అన్నాడు అనుమయ్య విసుగుగా ...

ఆ తరవాత ప్రతిరోజూ కుశాలరావును గురించి చర్చ జరుగుతూ వచ్చింది.

"అదికాదు నేనసేది, అతనిలో ఏదో లోటు లేక పోతే పిల్లను చూసి ఒక్క ప్రశ్న అయినా వెయ్యకుండా ఎందుకు ఒప్పుకున్నాడు ?" అనేది కమలమ్మ.

"అంత లోటు గలవాడు అసను పిల్లను చూస్తా నంటూ ఎందుకు రావటం ? అదీగాక దాన్ని చూసి ఎందుకు నవ్వాడూ ? ఆ సంగతి చెప్పు. తా వలచింది రంభా ! దానికేమి టంటాను !" అనేవాడు అనుమయ్య.

"అసలు అతను ఒప్పుకున్నాడని మీకు ఎవరు చెప్పా రంట ?" అని మధ్యలో ముకుందుడు అందుకునేవాడు.

"నువు నోరు ముయ్యరా !" అనేవాడు అనుమయ్య.

"అది కాదండీ ! పిల్లను కూడా చూడకుండా పెళ్ళికి ఒప్పుకుంటే మనం అనుమానిస్తామేమోనని చూశాడే గాని——" అనేది కమలమ్మ.

"అలా అయినా అనుమానిస్తూనే వుంటిమిగా ! నువు చెప్పేది అహోరించినట్టే వుంది. వెర్రికుదిరింది, రోకలి తలకు చుట్టమన్నాట్ట !" అనేవాడు అనుమయ్య.

"అనుమానించవద్దని మీరు అంటున్నారుగా !.... అసందర్భంగా వచ్చిన సామెతలన్నీ ఏకరువు పెట్టకండి. ఇందులో వెర్రిప్రసక్తి ఏముంది? రోకలి తలకుచుట్టే ప్రసక్తి ఏముంది ?" అనేది కమలమ్మ. ఎంతచెడ్డా కవిగారికూతుర

"చూస్తూండండి, ఆ కుశాగ్రావనే కుర్రవా ఈపాటికి ఇంకొక సంబంధం చూసుకునే ఉంటాడు" అ వాడు ముకుందుడు.

"చదవేస్తే ఉన్న మతి పోయిందట, చాలే పూరుకో!" ఎంత వద్దన్నా అనుమయ్యకు సామెతలు చెడ్డ యిష్టం.

ఆ తల్లీ, ఆ తండ్రీ, ఆ కొడుకూ ఆ మూడు గుంజలనూ దాటి ఆటే దూరం వెళ్ళకుండా చాలా గిరికీలు కొట్టారు. ఈ సుడిగుండాల జోలికి రాకుండా నిశ్చింతగా ఉన్న ఒక్క ప్రాణి చంద్రావతి.

చంద్ర మనసులో ఎటువంటి అనుమానాలూ లేవు. కుశాలరావు తనను తప్పక పెళ్ళాడతాడని ఆమెకు రూఢిగా తెలుసు. ఆమె అప్పుడే ఆ మొగుడివెంట పార్కుల్లో షికార్లు చేసింది, బీచిలో కూర్చున్నది, సినిమాలకు వెళ్ళింది.

చంద్ర ఈ విషయంలో తల్లి పోలికా కాదు, తండ్రి పోలికా కాదు. ఆమెకు తన అదృష్టంలో పూర్తి విశ్వాసం ఉంది—అందుకే ఏ పరీక్షకూ చదివేదికాదు. చదువు మానినా, సంగీతం మానినా ఆ పిల్లకు చీమకుట్టినట్టుగా కూడా లేదు.

తండ్రిలాగా భవిష్యత్తు గురించి ఆలోచించటానికి బిడియమూ లేదు.

కాని మిగిలినవాళ్ళను కుశాలరావు చాలా బాధ పెట్టాడు. బాధపెట్టాలని అతని ఉద్దేశం కాకపోవచ్చు. తాను అనుమయ్యగారింట్లో ఎలాటి తేనె తుట్టె రేపెట్టాడో

అతను వూహించికూడా ఉండకపోవచ్చు, కాని ఆ పని చేసినందుకు పూర్తిగా అతనే బాధ్యుడు.

ఈ ప్రపంచంలో ఎవరు ఎలాటి పాత్ర నిర్వహించాలో ముందుగానే నిర్ణయించి ఉంటుంది. ఏ మనిషీ తద్భిన్నంగా ప్రవర్తించరాదు.

చంద్రను చూసినాక కుశాలరావు, "నా అభిప్రాయాన్ని తరవాత ఉత్తరం ద్వారా తెలియజేస్తానులెండి. ఈ లోపుగా మీ అమ్మాయి ఉద్దేశంకూడా తెలుసుకోవాలి గదా!" అని వెళ్ళిపోతే ఎవరికీ ఏ బాధా ఉండేది కాదు.

"అతను తనకు పిల్ల నచ్చినట్టు స్పష్టంగా అన్నాడు," అంటుంది కమలమ్మ.

"నువ్వనుకున్నంత స్పష్టంగా అతనేమీ అనలేదులే. అదుగో పులి అంటే ఇదుగో తోక అన్నాడట!" అంటాడు అనుమయ్య.

"అతనేమన్నాడో జ్ఞాపకంఉంటే మీరు చెప్పండి!" అంటుంది కమలమ్మ.

"నీకు జ్ఞాపకం ఉంటే నువ్వేచెప్పరాదూ!" అంటాడు అనుమయ్య.

"పిల్ల అయితే నాకు నచ్చిందిగాని, మిగిలిన విషయాలు మాట్లాడటానికి పెద్దవాళ్ళు వస్తారు," అన్నాడు.

'పిల్లఅయితే నాకు నచ్చింది!'— ఆ అయితే ఏమిటి? మా విరుపాక్షుల వారి భాష అందరూ మాట్లాడుతారని నీ ఉద్దేశం?" అని అనుమయ్య కొక్కిరిస్తాడు.

"నా పోటు నాన్నకే. వాడు పిల్ల నచ్చిందని తన నోటిమీదుగా చచ్చినా అని వుండడు. నిజంగా నచ్చినా అనడంటాను. అది కామన్ సెన్స్ కాదు. కొంచెం ఆలోచించమ్మా! ఎవరైనా—" అంటాడు ముకుందుడు.

"నువు నోరు ముయ్యరా!" అంటాడు తండ్రి పళ్లు బిగబట్టి.

కుశాలరావు నిజంగా అన్నదేమిటో భార్యా భర్త లిద్దరికీ జ్ఞాపకం రాలేదు మొత్తానికి....

అయిదు రోజులనాడు స్తంభించిపోయి ఎంతో అలజడీ, ఆందోళనా కలిగించిన పరిస్థితి ఇవాళ మధ్యాన్నం రెండున్నర గంటలకు కదలబారింది.

ఆదివారంగనక అనుమయ్య ఇంట్లోనే ఉన్నాడు. అదేం చిత్రమో బయటినుంచి, "హనుమయ్యగారిల్లిదే నాండి?" అన్న ప్రశ్న వినిపించే సమయానికి ఆయన తన కూతుష పెళ్ళి గురించి గాని, కుశాలరావును గురించిగాని ఆలోచించటంలేదు.

బయటినుంచి ఆ శరీరవాణి 'హనుమయ్య' అనే మాట అనటం విన్నప్పుడు ఆయనకు మొదట కలిగిన భావం చిరాకు. తన పేరు హనుమయ్య అయివుంటుందనీ, తెలియక తాను అనుమయ్య అని చెప్పుకుంటున్నాడనీ చాలామంది అపోహ పడ్డారు.

తన పేరు హనుమయ్య కాదు అనుమయ్య.

అందులో తను పొరపాటుపడేందు కేముంది? హనుమయ్య అయితే హనుమయ్య అనే చెప్పుకుంటాడుగా!

అందులో సిగ్గుపడటాని కేముందీ ? తాను తనపేరు అను మయ్యా అని చెబుతున్నాడాయె, అనుమయ్యా అని రాసుకుం టున్నాడాయె, నమ్మితే ఇంతలో కొంప ఏం మునిగిందీ ? మధ్య తమ పైత్యం ఎందుకూ ?

పడకకుర్చీలో పడుకునిఉన్న అనుమయ్యా, "ఎవరండీ అదీ ?" అంటూ యుద్ధానికి బయలుదేరేవాడల్లే లేచాడు.

బయట మందమైన అద్దాల జోడు పెట్టుకుని ఒక బట్టతల పెద్దమనిషి నిలబడి ఉన్నాడు. ఆయన వయస్సు నలభయ్యో, యాభయ్యో ఉండవచ్చు. మీసాలు పంచెమి చంద్రుడల్లే పై పెదవికి అంటుకుని ఉన్నై. పెదిమలు గులాబీ రంగుగా, తడిగా ఉన్నాయి. పల్చని మిల్లుపంచా, మల్లు లాల్చీ ధరించి ఉన్నాడు. మడత విప్పని జరీఅంచు పైపంచె మెడకు ట్రస్‌లాగా తగిలించుకున్నాడు. కాళ్ళకు స్లిప్పర్లు ఉన్నయ్.

"తమరేనా హనుమయ్యగారు ?" అన్నాడాయన చాలా తొందరమీద ఉన్నవాడల్లే.

"నేనే అనుమయ్యాను. ఏం పనిమీద వచ్చారు ?. రండి లోపలికి !" అన్నాడు అనుమయ్యా.

నేను కుశాల్రావు మేనమామను. మెయిలు చాలా లేటు. పదకొండింటికి వచ్చింది. భోంచేసి కాస్త విశ్రాంతి తీసుకుని మరీ వస్తున్నా," అంటూ ఆ పెద్దమనిషి లోపలికి వచ్చాడు.

అనుమయ్యా తాను ఖాళీచేసిన పడక కుర్చీ ఆయన కిచ్చి, గోడవారనుంచి పేముకుర్చీ లాక్కుని కూర్చున్నాడు.

"శ్రీరామచంద్ర !" అంటూ ఆ పెద్దమనిషి పడక కుర్చీలో చేరగిలబడి, ఒక్క నిట్టూర్పు విడిచి, కళ్లు మూసుకుని స్వగతం చెప్పుకుంటున్నవాడల్లే తన మాటలకు తానే సందర్భోచితంగా తలవూపుతూ, "మావాడు మీ సంబంధం గురించి రాసిన ఉత్తరం నాకు మొన్ననే అందింది. అయితే తొందరపనులుండి నిన్న రాత్రి మెయిలు తప్ప అందుకోలేకపోయానూ: రాగానే సమాచారాలన్నీ తెలిశాయీ: మా మేనల్లుడు మీతో ఉన్న విషయాలన్నీ చెప్పాడో లేదో నాకు తెలీదూ: వాడి తండ్రికి అరవై, తెబ్బయివేల ఆస్తిఉందీ: కాని మా కుశాలుతల్లి పోయాక వాడు అచ్చగా నా దగ్గరే పెరిగాడూ—సవితితల్లి సరిగా చూస్తుందా, మీరే చెప్పండి !" అన్నాడు.

ఆయన కళ్ళుతెరచి అనుమయ్యకేసి చూశాడు. అనుమయ్య అర్థమయిందన్నట్టు తల ఆడించాడు.

ఆ పెద్దమనిషి మళ్ళీ కళ్ళు మూసుకుని "కుశాలు కిందటేడే బియ్యే పాసయి ఉద్యోగంకోసం చూస్తున్నాడు. ఈపాటికి దొరికే ఉండును—వాడితో చిక్కేమిటంటే వాడికి చిన్న చిన్న ఊళ్ళూ, చిన్న చిన్న ఉద్యోగాలూ పనికిరావు. పట్నంలోనే మంచి ఉద్యోగం దొరికేదాకా వాడు ఖాళీగానే ఉంటాడు. అందుకే నేను, 'అబ్బీ, నువ్వు పట్నం సంబంధం చూసుకో. అన్నివిధాలా కలిసివస్తుంది,' అని సలహా ఇచ్చా. అవతల వాడి తండ్రి ఉత్తరాలమీద ఉత్తరాలు రాస్తున్నాడు. 'వుద్యోగం ఎందుకు, సద్యోగం ఎందుకు ? ఇంటిపట్టున కడుపులో చల్ల కదలకుండా చోకూ

మని!' కాని వాడు తండ్రిదగ్గిరికి వెళ్ళడు. నాకు తెలుసు. వాడు పట్నం చేరటమే శ్రేయస్కరం. చూశారో లేదో, హనుమయ్యగారూ! మీ అమ్మాయి మీకు దగ్గిరలో వుంటుంది. ఇది అందరికీ సులువుగాఅమరే ఏర్పాటు కాదు," అంటూ కళ్ళు తెరచి తలఎత్తి అనుమయ్యకేసి చూశాడు:

"నా పేరు అనుమయ్య."

"నాకు తెలీదా?"

"హనుమయ్యకాదు."

పెద్దమనిషి బిత్తరపోయినట్టు కనబడ్డాడు. "మీరే అవునని మీరే కాదంటారేం?" అన్నాడాయన, ఆ అక్ర మానికి ఏమనుకోవాలో అర్థం కానట్టుగా.

"ఆ—ఆ—ఆ—అనుమయ్య, హనుమయ్యకాదు" అన్నాడు అనుమయ్య.

"మీకు తెలీదు. హనుమయ్యే అయివుంటుంది. అనుమయ్య అనే పేరు నే నెక్కడా వినలేదు."

"అయినా అదే నా పేరు, హనుమయ్యకాదు. వెన్నవతల సిద్ధాంతిగారు పెట్టిన పేరది."

"అనుమయ్య! అనుమయ్య! చిత్రంగా ఉంది. అనుమకొండవా రున్నారు, కాని అది నిజంగా హనుమ కొండ అనే ఇంటిపేరే అని నా నమ్మకం. ఒకవేళ అను ములమీాది నుంచి అనుమయ్య అని పెట్టి వుంటారా?

చిత్రం! చిత్రం!! అని పెద్దమనిషి తనలో తాను మాట్లాడుకున్నాడు.

"ఇంతకూ మీ పేరు సెలవిచ్చారుకారు," అన్నాడు అనుమయ్యా.

"నాపేరా? నాపేరు భద్రాచలం లెండి....ఏమిటో చెబుతున్నాను."

"మీ మేనల్లుడు బస్తీ వుద్యోగం కావాలంటున్నాడని."

"ఆ తరవాత ఇంకేదో చెప్పాను."

అనుమయ్యాకు చిరాకెత్తింది. ఈ భద్రాచలం వట్టి జిడ్డుమనిషిలాగా వున్నాడు.

"ఏదో అన్నారు కాబోలు. ఇంతకూ పెళ్ళిమాట ఏమిటి? మీ కుశాల్రావుకు మాపిల్ల నచ్చిందనుకోవచ్చా? మీరుకూడా పిల్లను చూద్దురుగాని," అన్నాడు అనుమయ్యా.

"ఎబ్బె, ఎందుకండీ? మీరు చూడమంటే చూస్తాననుకోండి. కాని అనవసరం. వాడికి మీపిల్ల నచ్చింది. మీరు నా వెంట మా బసకు వచ్చారంటే మిగిలిన విషయాలు మాట్లాడుకుని ముహూర్తంకూడా పెట్టుకుందాం. ఏమంటారు?" అన్నాడు భద్రాచలం.

కార్యవాది అయిన అనుమయ్యాకు ఈ మాట నచ్చింది. ఆయన "అమ్మాయ్, చంద్రా!" అని కేక వేసేసరికి చంద్ర వచ్చింది. "నేనిప్పుడే వస్తానని అమ్మతో చెప్పి, ఈ బయటి తలుపు వేసుకో!" అన్నాడు అనుమయ్యా.

"ఈ అమ్మాయేనాండీ?"

"అవునండీ!"

"పిల్లకేం? నిక్షేపంగా వుంది," అన్నాడు భద్రాచలం.

ఇద్దరూ కలిసి వీధిలోకి రాగానే భద్రాచలం, "ఒక టాక్సీ చేసుకుందామా ఏమిటి?" అన్నాడు.

అనుమయ్య సరేనన్నాడు. ఆయనకు టాక్సీలు చేసుకునే అలవాటు బొత్తిగా లేదు. కాని వెనకాడటాని కిదిగాదు సమయం.

వీధి మలుపులో ఖాళీ టాక్సీ దొరికింది. దాన్ని ఆపి ఇద్దరూ ఎక్కి కూర్చున్నారు.

"చూడండి హనుమయ్యగారూ! ఒక్క విషయం నేను మాట్లాడినట్లు మావాడికి తెలియనివ్వకండి. అదేమి టంటే కట్నం విషయం. వాడికి కట్నాలంటే చెడ్డమంట. కాని వాడి తండ్రి పాతకాలపువాడు. అంతో ఇంతో కట్నం లేకుండా తన కొడుకు పెళ్ళాడటానికి ఆయన ఒప్పుకోడు. మీరైనా తగిన అల్లుడు దొరికితే కట్నం ఇవ్వటానికి వెనకాడబోరుగా! అందుచేత మనం ఇంతా అని అనుకుంటే ఆ విషయం వాళ్ళ నాన్నకు రాసి ఒప్పి స్తాను. ఇందులో బేరం ఏమీ లేదు సుమండీ! నే నింత కంటె ఇవ్వలేను అని చెప్పెయ్యండి: నే నామాటే మా బావగారికి రాస్తాను, తెలిసిందిగాదూ? మీరు రోలీ అనండి, నేను ఇంతేనా అని అనను. కాకపోతే ఈ

విషయం మావాడి దగ్గర మాత్రం ఎత్తకండి," అన్నాడు భద్రాచలం.

అనుమయ్య మనస్సు విమానంలాగా పరిగెత్తింది. ఎంత చెప్పాలన్నదే సమస్య. రెండువేలంటే మరీ తక్కువగా ఉంటుందా ?

"రెండువేల అయిదు వందలదాకా ఇవ్వడానికి నాకు శక్తి ఉన్నదనుకోండి. మళ్ళీ పెళ్ళిఖర్చుల భారం ఒకటి ఉందిగద. అందుకని ముందుగా—"

"మీకు పెళ్ళిఖర్చు లంటూ పెద్దగా మావైపునుంచి ఏమీ ఉండవనుకోండి. పిల్లవాడి తరఫున వస్తే వాడి తండ్రివాళ్ళూ, నేనూ, మా వాళ్ళూ వస్తాం. ఓపిక ఉంటే బట్టలు పెట్టండి, లేకపోతే అదీవద్దు. తెలిసిందిగదూ ?" అన్నాడు భద్రాచలం.

ఎటువేపునుండి చూచినా అనుమయ్యకు అనుకూల్యమే కనబడుతున్నది.

"సరే కానివ్వండి. అల్లుడికి మూడువేలు కట్నం ఇస్తాను. పెళ్ళిఖర్చులు తేలికలోపోతే చాలు," అన్నాడు అనుమయ్య.

"సరే ఆ సంగతి ఇవాళే మా బావగారికి రాస్తాను. మా బసలో తెలిసిన పెద్దమనిషి ఉన్నాడు. ముహూర్తం కూడా పెట్టేస్తాడు."

తరవాత కొంచెంసేపుండి, "మీరు పనిచేసేది ఎక్కడన్నారూ ?"

"బ్రైగ్సన్ అండ్ ముర్రే, సెకండ్ లైన్ బీచ్, షిప్పింగ్ ఏజెంట్స్. మా ఆఫీసు బిల్డింగ్ విక్టోరియారాణి హయములో కట్టారు. ఒకప్పుడది గోడవున్. 1884 లో తగల బడిపోయింది. మరుసటియేడు మరమ్మత్తు చేశారు."

అనుమయ్య సామాన్యంగా ఎక్కువ మాట్లాడేమనిషి కాదు. తన బుర్రకు విశ్రాంతియిచ్చే వుద్దేశంతో నోటికి వచ్చినదల్లా మాట్లాడసాగాడు.

"మీకు జీతం బాగా వుంటుందనుకుంటాను."

"ఏం బాగులెండి! నాగువలుందలిస్తారు. నాకు మన వైపుల—అంటే మా కత్తెరంపాడులో — భూము లున్నయి. ఏటా ఆరేడు వందలు వస్తుంది. గుంటూరులో ఇల్లు కట్టాను. దానిమీద నెలకో పంద అద్దె వస్తుంది.

"బాగుంది. ఆటే భారీ కుటుంబం కాదాయె. మీరు అన్నదమ్ములూ, అప్పచెల్లెళ్ళూ ..ఎంతమం దన్నారూ ?"........

వాళ్ళు అడగటమూ సబబే, వీళ్ళు చెప్పటమూ సబబే. అనుమయ్య తన పుట్టుపూర్వోత్తరాలన్నీ భద్రా చలానికి చెప్పాడు.

టాక్సీని రాయపేట పోలీసుస్టేషను మీదుగా కొత్త వుడ్‌లాండ్స్ హోటలును పట్టించి భద్రాచలం, "దిగండి," అన్నాడు. అనుమయ్య "ఇదా బసంటే ?" అని ఆశ్చర్య పడుతూ దిగాడు. యాదాలాపంగా చూసేసరికి ఎదురుగా టాక్సీమీటరులో రూపాయీ అరణాలు కనిపించింది.

అనుమయ్య చిల్లరలేక టాక్సీవాడి చేతిలో ఒక రూపాయీ, ఒక అర్ధరూపాయీ పెట్టాడు. టాక్సీవాడు బేడా తిరిగి ఇవ్వటానికి బదులుగా అది తనకు ముట్టిందన్నట్టు ఒక సలాం కొట్టాడు.

ఇదంతా అయినాక "శ్రీరామచంద్ర!" అంటూ భద్రాచలం టాక్సీలోనుంచి బయటికి వచ్చాడు. ఇద్దరూ కలిసి కాటేజీలకు వెళ్ళారు. మూడో నంబరు కాటేజీ భద్రాచలం ఉంటున్నది.

అక్కడ కుశాల్రావుకూడా ఉన్నాడు. అతను తమ ఇంటికివచ్చిన రోజు వుదయంనుంచీ ఆ కాటేజీ అద్దెకు తీసుకుని అక్కడే ఉంటున్నట్టు అనుమయ్య తెలుసుకున్నాడు.

కుశాల్రావు ఈసారి బనీనూ, లుంగీ ధరించి కనిపించేసరికి అతను ఎంత సన్నని మనిషో అనుమయ్యకు బాగా అర్థమయింది. ఆ సన్నంమీాద మరింత పొడుగ్గా కూడా కనిపించాడు.

మెడలో "లైన్ క్లియర్" లాగ వున్న పై పంచెను భద్రంగా తీసి ఒక కొయ్య మేకుకు తగిలించి "శ్రీరామచంద్రా!" అంటూ భద్రాచలం ఒక కుర్చీలో నింపాదిగా కూచుని, అనుమయ్యకు మరొక కుర్చీ చూపించాడు.

వాళ్ళు లోపలకు వచ్చేసరికి కుశాల్రావు ఇంకొక మనిషితో మాట్లాడుతున్నాడు. ఆ మనిషికి ముప్పై ఏళ్ళుండవచ్చు. చలికి వణికిపోతున్నవాడల్లే మందమైన కాఫీరంగు వులెన్ సూటు వేసుకుని మెడకు మఫ్లర్ కూడా

చుట్టుకున్నాడు. ఆయన చేతిలో ఏదో కాగితంమీద జాతక చక్రంలాంటిది వున్నది. అది కుశాల్రావుదేనని త్వరలోనే అనుమయ్యకు అర్థమయింది.

"ఈ ఏడు పెళ్ళి విధిగా జరిగి తీరుతుంది నీ జాతకం బట్టిచూస్తే నీ భార్యద్వారా నీకు అర్థికలాభం వుండాలి," అన్నాడు కాఫీరంగు సూటువాడు.

"మా వాడికి పిల్ల లెంతమందిరా, సుబ్బులూ?" అన్నాడు భద్రాచలం.

"ఇద్దరో, ముగ్గురో వుంటారు. మొదట విధిగా ఆడ పిల్ల," అన్నాడు సుబ్బులు.

"పెళ్ళి విషయం నీ జోస్యం ఎవడికావాలిరా? ఇదుగో మన కుశాలుకు కాబోయే మామగారు. త్వరలో మంచి ముహూర్తం ఎప్పుడున్నదో శాస్త్ర చూడు," అన్నాడు భద్రాచలం.

"పిల్లది ఏ లగ్నం?" అన్నాడు దైవజ్ఞుడు అనుమయ్యకేసి తిరిగి.

"ధనుర్లగ్నం," అన్నాడు అనుమయ్య.

"భేష్! మనవాడు కన్యాలగ్న జాతకుడు. ఇద్దరిదీ కోణమే. పంచాంగం వుంటే ముహూర్తం పెట్టెద్దామే"? అన్నాడు సుబ్బులు.

"కుశాలూ, నా సంచిలో వుంటుంది చూడూ!" అన్నాడు భద్రాచలం.

సరిగా ఇంకొకనెలకు భేషయిన లగ్నం వుందిట.

ఆడపిల్ల పెళ్ళి ఇంత సులువుగా ఏర్పాటవుతుందని అనుమయ్య అనుకోలేదు. ఆయన తన కాబోయే వియ్యంకుడి అడ్రసు తీసుకుని వాళ్ళదగ్గర సెలవు పుచ్చుకుని బయలుదేరుతుంటే, భద్రాచలం "మేమిా మెయిలుకు బయలుదేరి వెళ్ళుతున్నాం!" అని చెప్పాడు.

బస్సుకోసం స్టాండుదగ్గిర నిలబడిన అనుమయ్య ఈ పెళ్ళి సందర్భంలో ఇంకా చెయ్యవలసిన ముఖ్యమైన ఏర్పాట్లుకొన్ని వుండిపోయుంటాయనీ, వాటిని అందరూ మరచిపోయి వుంటారనీ అనుకున్నాడు.

ఎంత ఆలోచించుకున్నా ఇంకేం చెయ్యాలో ఆయనకు తెలియలేదు.

"జరిగే పెళ్ళిళ్ళు సులువుగానే జరుగుతాయి. జరగని పెళ్ళిళ్ళే చాలా కష్టం. అందుకనే మనవాళ్ళు 'కల్యాణం వచ్చినా, కక్కొచ్చినా ఆగద'న్నారు," అనుకున్నాడు అనుమయ్య....

అంతా విని కమలమ్మ "సడేలే, ఈ పెళ్ళి అయినట్టే!" అన్నది.

"వెనకటి కెవడో రామాయణమంతా విని—ఎందుకాదూ ?" అన్నాడు అనుమయ్య. కాని చిక్కేమిటంటే, తను అనుకోకుండా వుండాలని విశ్వప్రయత్నం చేస్తున్న అనుమానాన్ని తన భార్య పైకి అనేసింది. అది భరించటం ఆయనకు కష్టమయింది.

"ఎవరిబిడ్డరా ఎక్కెక్కి ఏడుస్తున్న దన్నట్టు, ఈ పెళ్ళికి పెద్ద లెవరు ? ఏం మాటలు జరిగాయి ? ఎవరి

ఎదట ముహూర్తాలు పెట్టుకున్నట్టూ?" అని కమలమ్మ విషయాన్ని పింజ విప్పసాగింది.

"నీ ఇక్ష్వాకులనాటి కబుర్లు కట్టిపెట్టు. ఈ కాలపు కుర్రాళ్ళు అంతా తామే చేసుకుంటారు. పైగా, వెంట మేన మామ వున్నాడు. పెళ్ళికొడుకు తండ్రి ఎడ్రసు నా జేబు లోనే వుంది. రేపు వర్జంలేకుండా చూసి ఆయనకు ఉత్తరం రాయబోతున్నా! సరా?" అన్నాడు అనుమయ్య.

ఈ మాటలతో కమలమ్మ కొత్త తిరోగమించింది. ఆవిడకుకూడా పిల్ల పెళ్ళి కావాలనేగా?

సరిగా తల్లితండ్రులు రాజీపడే సమయానికి "బేతింగ్ బ్యూటీ" మాటినీ షో చూసి ముకుందుడు ఇల్లు చేరాడు.

"చంద్రికి సంబంధం కుదిరినట్టే వుందిగా," అన్నది తల్లి.

"మళ్ళీ ఎవరు వచ్చారేమిటి?" అన్నాడు ముకుందుడు.

"రెడ్డొచ్చె మొదలాడే అన్నట్టు నువు సమయానికి ఇంట్లో వుండకుండా పోతావు. నీకు పూసగుచ్చినట్టు అంతా చెప్పాలి," అన్నాడు అనుమయ్య.

ముకుందుడు కాస్సేపు ఆలోచించి "ఇందులో ఏదో మిస్టరీవుంది! వాళ్ళు నేను లేని సమయంలో తప్ప రావటం లేదు," అన్నాడు.

"అహారించినట్టే వుంది.... అన్నం వడ్డిస్తావా ఏం!" అన్నాడు అనుమయ్య భార్యతో.

# 2

రాహుకాలమూ, వర్జమూ, యమగండమూ లేకుండా చూసుకుని అనుమయ్య కుశాలరావు తండ్రి మంగళేశ్వర్రావుగారికి వుత్తరం రాసి స్వహస్తంతో పోస్టు చేశాడు.

ఈ విధంగా పెళ్ళి సంబంధం నిర్ణయం కావటం ఎందుకు అవాస్తవమనిపిస్తున్నదీ ఆయనకు కొంచెంకొంచెమే అర్థం కాసాగింది. ఆయనకు ముప్పై ఏళ్ళక్రితం పెళ్ళయింది. కమలమ్మ ఆయనకు ఎనభై మైళ్ళ దూరాన దొరికింది. అయినా కమలమ్మ తండ్రి మొదటిసారి తమ ఇంటికి వచ్చినప్పుడే వూళ్ళోవున్న నలుగురూ చేతి క్షణంలో ఆయనతో బాంధవ్యాలు కలిపేశారు. వారిలో ఒక్కరూ కమలమ్మ తండ్రిని ఎరగకపోయినా, ఆయన తాలూకు బంధువులతో బంధుత్వాలున్నవాళ్ళూ, పరిచయం వున్నవాళ్ళూ ఎందరో కనిపించారు. పెళ్ళి కాకమునుపే సంబంధాలు కలిశాయి.

ఈ కుశాల్రావుతో అలా ఖత్తు కలవకుండా వున్నది. ఈ మంగళేశ్వర్రావెవరో చెప్పేవాళ్ళు లేరు. ఈయన బెజవాడకూ బందరుకూ మధ్య ఒక కుగ్రామంలో వుంటున్నాడు. ఆ ప్రాంతాల తన బంధువులు గాని, తన భార్య వైపువారు గాని ఒక్కరు కూడా లేరు. అందుకే అంతా అయోమయంగా, చీకట్లో తడువులాటగా వున్నది.

పోనీ నలుగురిదగ్గిరికీ వెళ్ళి, "ఏమర్రోయ్, మాపిల్లకు ఫలానివారి సంబంధం నిశ్చయించాం," అని చెప్పటానికైనా ఈ పట్నంలో ఎవరున్నారు? ఒకరూ, ఇద్దరూ వున్నా, "ఓహో! అలాగా? శుభం!" అంటారే తప్ప, వేట కుక్కల్లే పడి, "వీళ్ళు ఎవరు? ఏమిటి విషయం?" అని ఆరాలు తీయరు.

ఈ బాధ అనుమయ్యకన్న కమలమ్మ ఎక్కువగా అనుభవించింది. ఈ మహాపట్నంలో ఆవిడ "చుట్టాలుకాని చుట్టాల" కింద పరిగణించుకుంటున్న తెలుగు కుటుంబాలు మూడు నాలుగు మాత్రమే ఉన్నా, ఒకరు అమ్‌జికరేలో వుంటు వుంటున్నారు, ఇంకొకరు త్యాగరాయనగరంలో వుంటు న్నారు, మరొకరు చాకలిపేటలో వుంటున్నారు. ఎగ్మోరు హైరోడ్డులో వుంటున్న తను సులువుగా వాళ్ళ యిళ్ళకు పోలేదు. అందుచేత కమలమ్మ నాలుగు కార్డులు తెప్పించి తన బంధువులకందరికీ రాసేసి వారి జవాబులకోసం ఎదురు చూడసాగింది.

సాధ్యమైనంత కవిత్వంపెట్టి రాసిన కమలమ్మ వుత్తరాలకు జవాబులు ఒకటొకటిగా వచ్చి చేరాయి. అందరూ చంద్రావతిని ఆశీర్వదించి తమ సంతోషాన్ని వెలిబుచ్చారు. కాని ఆ మంగళేశ్వరరావును ఎరుగుదుమనిగాని, ఆయన్ను గురించి విన్నామనిగాని రాసినవారు లేరు.

"ఏమండోయ్, ఇవాళ సూరంపిన్ని జవాబు రాసింది.... ఇప్పుడే శేఖరన్నయ్య రాశాడు.... ఈ వుత్తరం

సోమ్మొదినె దగ్గిర్నించే!" అని కమలమ్మ అంటుంటే అనుమయ్యకు, నాయుడుబావ అన్నట్టు గుండె గొంతు కలోకొట్లాడింది.

ఆయన రాసిన ఉత్తరానికి "మంగళేశ్వరావు బావగారి దివ్య సన్నిధ" నుంచి జవాబు లేదు.

అనుమయ్య మరో ఉత్తరం ఎవ్వరికీ తెలియకుండా రాశాడు. "జవాబు జరూరు" అని కూడా రాశాడు.

దానికీ జవాబు లేదు. పెళ్ళి పద్నాలుగు రోజుల్లోకి వచ్చింది.

తప్పుడు ముండాకొడుకు ...ఏమిటి వీడి వుద్దేశం? అసలు వీడెవడని?....ఈ సంబంధం మానేస్తాను. ఆ వాన పాముగాడు — కుశాల్రావు - రాలేదనుకుంటాను....మనుషులకు మానమర్యాద లుండవద్దూ, మనిషిజన్మ ఎత్తలా? పెళ్ళి కాకముందే ఇంత తలపొగరైతే ఆ తరవాత ఎంత చూపిస్తారో! ...ఈ ధోరణిలో గంటల తరబడి అనుమయ్య ఆ మంగళేశ్వరరావునూ, కుశాలరావునూ, ఆ చేత్తోనే భద్రాచలాన్నీ చెడతిట్టుకున్నాడు. లోపల రగిలే మంటను పైకి చూపే అలవాటులేనివాడికి అంతకన్న చేసేది ఏమీ లేదు.

అవతల కొడుకూ, పెళ్ళామూ తనను చాలా చులకనగా చూడసాగారు ఇలాటి సంబంధం కుదిర్చినందుకు. తనకు కలిగే అవమానాన్ని వాళ్ళు పంచుకోదలచ లేదు.

అనుమయ్య ఉక్రోషం పట్టలేక పేపర్లో పెళ్ళి ప్రకటనలు చూసి వాటన్నిటికీ జవాబు రాసి పారేశాడు. వాటికి అతీగతీ లేకపోయింది.

"ఇదిగో నేను పెళ్ళి ప్రయత్నాలేమీ చెయ్యబోవడంలేదు. నన్నెవరేం అంటారో చూస్తాను!" అన్నాడొకనాడు అనుమయ్య భార్యతో.

"ఆ మాటన్నారు బాగుంది!" అన్నది కమలమ్మ.

అనుమయ్యకు అకస్మాత్తుగా ఏనుగుకు వచ్చినంత బలం వచ్చినట్టయింది. ఈ బెడదలో ఎందుకు ఇరుక్కున్నామా అని బాధ పడుతున్నవాడు కాస్త జైలునుంచి బయటపడిన వాడులాగా అయ్యాడు.

ముకుందుడు కూడా తండ్రి నిర్ణయాన్ని హర్షించాడు. "నువ్వు నిష్కారణంగా హైరాన పడ్డావుగాని ఆ ఖుశాలరావు మళ్ళీ కనిపించాడా? వాడెవడో ఒక లోఫర్. నన్నడిగితే వాడి మేనమామ నంటూ వచ్చినవాడు ఒక తోడుదొంగ అయి వుండాలి!"

అనుమయ్యకు ఇది పూర్తిగా తలకెక్కలేదు. "వాళ్లు ఇంత తతంగం ఎందుకు చేశారంటావ్? కాస్త ఆలోచించు. ఆ ఖుశాల్రావు చేతి చమురుతో భార్య కావాలని పత్రికల్లో ప్రకటన వేశాడా? అయిదు రోజులపాటు హోటల్లో వుండి ఏ రెండువందలో తగలేశాడా? ఇదంతా కేవలం నన్ను ఫూల్ చేసి అయిపులేకుండా పోవడానికే

అంటావా? మాట్లాడితే కామన్‌సెన్సంటావే? ఇదేం సెన్సూ?" అన్నాడాయన.

"నువ్వేనేదిగూడా కొట్టిపారెయ్యటానికి వీల్లేదు. కాని వాళ్ళు దొంగలన్నదేమో ఖరారే. కట్నం డబ్బులు కాజేసినదాకా వాళ్ళు నిన్ను వదలరు. మళ్ళీ వస్తారు. అందుకని మనం జాగ్రత్తమీద వుండాలి!" అన్నాడు ముకుందుడు.

"నేనా అంత సులువుగా టోపీ పడేవాణ్ణి!" అన్నాడు అనుమయ్య గర్వంగా.

ఆ రోజు అనుమయ్య కాంటీన్‌కు లంచికి బయలు దేరుతుండగా ఆఫీసు ఎదురుగా కుశాల్రావు కనిపించాడు. ఈసారి అతను గాబర్డీన్ సూటు వేసుకుని వున్నాడు. నెత్తిన ఈవెనింగ్ టోపీ వున్నది.

"ఇంటికివెళ్ళి వస్తున్నాను. ఇంట్లో అత్తగారూ, చంద్రా వున్నారు. అత్తగారు నాతో ఏదో నిష్ఠూరంగా మాట్లాడారు. నావల్ల మీకేమైనా ఇబ్బంది జరిగిందా?" అన్నాడు కుశాల్రావు.

అతనా ప్రశ్న అడిగిన ధోరణిచూస్తే అనుమయ్యకు ఆవురుమని ఏడవ బుద్ధి అయింది. అతను ఎంత బుద్ధి మంతుడల్లే వున్నాడు! ఎంత సంస్కారం కనబరుస్తు న్నాడు! తాను అతన్ని శంకించట మేమిటి? తన కూతురులాంటి దానికి అటువంటి మొగుడు తపస్సుచేస్తే దొరుకుతాడా?

"ఆ దానికేం తెలీదులే. ఏమన్నదేమిటి, ఏమన్నా నువ్వేమీ పట్టించుకోకు. లంచి తీసుకొందాం వస్తావా?" అన్నాడు అనుమయ్యా. పశ్చాత్తాపం ఆయనను రెట్టింపు ఆర్ద్రం చేసింది.

"పదండి పొద్దున్న నాయుడుపేటలో తిన్న టిఫినే! ఆకలి మండిపోతున్నది" అన్నాడు కుశాల్రావు.

అనుమయ్యా షాక్ అయ్యాడు. తన భార్య ఇంటికి వచ్చినవాడి కింత అన్నంకూడా పెట్టలేదన్నమాట! ఏం మనిషి?

"అరెరే, అయితే హోటల్లో భోంచెయ్యి. లంచి తిని రాత్రిదాకా ఎలా వుంటావు?" అన్నాడు అనుమయ్యా.

"ఆ సాంబారు రసంకంటె లంచే నయం. నేను ఆకే తిండిపుష్టి కలవాణ్ణి కానులెండి!" అన్నాడు కుశాల్రావు.

కాంటీన్‌లో అతను నాలుగు ఇడ్లులు కొబ్బరి పచ్చడితో తినేసి ఇంత కాఫీ తాగి ప్రాణం తేరుకున్న వాడు లాగా అయ్యాడు.

అనుమయ్యాకు అతన్ని చూస్తుంటే ఒక విధమైన ఆపేక్ష కలిగింది. ఇది ఆయనకు దాదాపు అపూర్వమైన అనుభవమే అనాలి. ఎందుచేతనంటే ఆయనకు తనభార్య మీదగాని, కొడుకుమీదగాని, కూతురుమీదగాని వుండే భావం అపేక్ష అనిపించుకునేటంత బలమైనది కాదు. వారితో ఆయనకుగల బంధాలలో ఆందోళనా, బాధ్యతా, ఒకొక్కప్పుడు కొంత సంతృప్తికూడా చేరి వున్నమాట

నిజమేగాని నిజమైన ఆనందం లేదు. ఎప్పుడైనా పుస్తకాలలో ఉండే పాత్రలపైన అనుమయ్యకు ఇలాటి ఆపేక్ష పుట్టుకు రావడం కద్దు. కాని వాస్తవ జీవితంలో-

కుశాల్రావుపైన పుట్టుకొచ్చిన ఈ భావం అనుమయ్యను స్వేచ్ఛగా మనసులో ఉన్నమాట అనటానికి ప్రేరేపించింది. అతనిపై అభిమానం పుట్టుకురాకపోతే అంత నిష్కపటంగా ఆమాట అడిగి ఉండడేమో!

"విషయ మేమిటంటే నేను మీ నాన్నగారికి రెండు ఉత్తరాలు రాశాను. ఒక్కదానికీ సమాధానం రాలేదు. 'ఒకవేళ వాళ్ళు మన సంబంధం మానుకున్నారేమో, మీ రెందుకు వట్టినే శ్రమపడతారు?' అన్నది మాఆవిడ," అన్నాడు అనుమయ్య కాఫీ ఆర్చుకుని తాగుతూ.

కుశాల్రావు ఆశ్చర్యపడ్డట్టు కనపడ్డాడు.

"రెండు ఉత్తరాలా? ఒకటి రావటం నాకు తెలుసు. నే నక్కడే వున్నాను. ఆ రోజే సమాధానం రాస్తున్నా నన్నాడు మా నాన్న. రాశాడనే అనుకున్నాను.... ఆయనకు నామీద చాలా కోపం వచ్చింది...."

కుశాల్రావు తనకూ తన తండ్రికీ మధ్య జరిగిన సంఘర్షణ గురించి ఆలోచిస్తున్నట్టు కనబడ్డాడు.

"కోపం దేనికీ?" అని అనుమయ్య అడిగిన ప్రశ్నకు అతను సమాధానం కూడా చెప్పలేదు.

"కట్నం తక్కువనా?" అని అనుమయ్య అందించాడు.

కుశాల్రావు కట్నం అన్న మాటకు పులిక్కి పడ్డవా డల్లే అయి, "చూడండి, మీ రసలు కట్నంగా నాకు కానీ ఇవ్వకండి. ఇవ్వదలచినదేదో మీ అమ్మాయికి నగలుగా ఇచ్చెయ్యండి. ఒకరికోసం నా నియమం ఎందుకు పాడుచేసుకోవాలి ?" అన్నాడు.

అనుమయ్య హృదయంలో మరో తరంగం వెచ్చగా పొంగినట్లయింది. ఈ కాస్త సేపటిలో ఆయనకు కుశాల్రావు పైన అంతులేని సదభిప్రాయం కుదిరింది.

ఇద్దరూ కలిసి బయటికి వచ్చినాక ఆయన కుశా ల్రావును, "నేను మళ్ళీ ఆఫీసుకు పోతాను, నీ ప్రోగ్రా మేమిటి ?" అని అడిగాడు.

"ముఖ్యమైన పనేమీ లేదు....అలా పోస్టాఫీసుకు వెళ్ళి నా పెళ్ళివిషయం నలుగురు మిత్రులకూ రాసేస్తాను. అన్నట్టు శుభలేఖలు అచ్చువేయించారా ?"

"ఇంకా లేదు. ఇవాళో, రేపో అచ్చుకిద్దా మనుకుం టున్నాను. ఇంకా టైమున్నది గద!" అన్నాడు అనుమయ్య. ఆయన అంతరాత్మలో చిన్న అలారం మోగింది. ఇంటి దగ్గిర ఈ పెళ్ళి అదివరకే రద్దయి పోయినట్టు తీర్మానం జరిగింది. ఆ తీర్మానాన్ని రద్దుచేస్తూ మళ్ళీ తను తన భార్యతోనూ, కొడుకుతోనూ ఘర్షణపడాలి.

ఆ ఘర్షణగురించి ఆలోచించినమాత్రం చేతనే అనుమయ్యకు వాళ్ళిద్దరిపైనా అంతులేని కోపం వచ్చింది.

వటి మూర్తులు-వాళ్ళు అనుకున్నదానికి విరుద్ధంగా తాను ఏ నిర్ణయం చేయదలచినా పంచాయతీ చేస్తారు. తను మహాపాపం చేసినట్టుగా మాట్లాడుతారు. తన అజ్ఞానానికీ, అమాయకత్వానికీ, అనాలోచనకూ విస్తుపోయినట్లు అభినయిస్తారు. తనను అర్థం చేసుకోకుండా వుండటానికి శక్తివంచన లేకుండా పాటుపడతారు.

"నా యిష్టం! నన్నడగటానికి మీ రెవరు? నోరు మూసుకోండి!" అన్నదాకా జిద్దు పట్టించి ఆ తరవాత నరరూప రాక్షసుడి వాతచిక్కిన అర్భకపుప్రాణుల పోజు పెట్టి ఒక రకమైన సత్యాగ్రహం చేస్తారు. ఆ తర్వాత సంవత్సరాల తరబడి తను ఇలా అన్నట్టు పని పెట్టుకుని జ్ఞాపకం చేస్తారు. ఆ తరువాత-

"ఏదైనా సినిమాకు పోదాం అనుకుంటున్నాను," అన్నాడు కుశాలరావు.

"ఏమిటి? .... ఆ ....ఆ! సరేలే. కాని ఎక్కడికి వెళ్ళినా భోజనం వేళకు ఇంటికి వచ్చెయ్యాలోయ్. ఎనిమిదిన్నరకు భోంచేస్తాం!" అన్నాడు అనుమయ్య....

అనుమయ్య అనుకున్నంతా అయింది. ఆయన ఆరింటికల్లా ఇంట్లో అడుగు పెట్టాడు. ఇంకా తలపాగా తీసేలోపునే కమలమ్మ, "అతను వచ్చాడండోయ్!" అన్నది.

"మా ఆఫీసుకు వచ్చాడు!" అన్నాడు అనుమయ్య.

"'నువ్వొ వద్దు, నీ పెళ్ళీవద్దు!' అని చెప్పేశారా,"

"ఎందుకూ?" అన్నాడు అనుమయ్య ఆశ్చర్యం అభినయిస్తూ.

"ఏమిటి ఎందుకూ?"

"పెళ్ళి వద్దనటం."

"సరే, మళ్ళీ మొదటికొచ్చారూ?వద్దనుకుంటిమిగా, అతనితో ఇదమిద్ధమని చెప్పనేలేదా ఏమిటి?" అన్నది కమలమ్మ, తన ఆశలన్నీ ఒక్క దెబ్బతో కుంగిపోయినట్లు.

"ఇదమూ లేదు, ఇత్థమూ లేదు! పరుగెత్తి పాలు తాగటంకంటె నిల్చునినీళ్లు తాగటంమేలు. ఇంతకాలానికి నిక్షేపమంటి సంబంధంవస్తే దాన్నికాస్తా కాదంటామా!"

"మీరూ వద్దనే అనుకుంటిరిగా? అప్పుడీ సంగతి తట్టలేదా ఏమిటి?" అన్నది కమలమ్మ కొంచెం వెటకారంగా. తాను తన మొగుడిలో లోత్త చూపిస్తున్నాననుకున్నప్పుడల్లా ఆవిడ గొంతు కాస్త వెటకారంగా మోగటం అలవాటు.

"నువ్వూ, నీ కొడుకూ చేరి ఇతను మళ్ళీ రానే రాడంటిరిగా? వచ్చాడేం?"

"ఇది మరీ బాగుంది! వాళ్ళు రారనుకున్నది మీరూ! మన ముకుందుడు అప్పుడే అన్నాడు కట్నం డబ్బులకోసం వస్తారు, జాగ్రత్తగా వుండాలని! 'నువ్వూ, నీ కొడుకూ' అని మమ్మల్నిద్దరినీ వున్నట్టుండి శత్రుపక్షంలో చేర్చేస్తారు చీటికీ మాటికీనూ!"

"నేను నీ మాటలు ఒక్కనాటికీ నమ్మను. నువ్వు ప్రతిదీ నీకు కావలసినట్టు జ్ఞాపకం పెట్టుకుంటావు! నువ్వన్నట్టే! అనుకున్నా, అతను తనకు కట్నం ఒద్దనేస్తున్నాడు. దానికేం చెబుతావు?"

"అనేశాడూ? ఇంకేం అంతా బట్టబయలయిందీ!" అన్నది కమలమ్మ గొప్ప సత్యం కనిపెట్టిన దానిలాగా.

అనుమయ్య అనుమానంగా, "ఏమిటది?" అన్నాడు.

"మీ కింకా అర్థంకాలా? నెత్తిన దమ్మిడీపెడితే ఏగాని విలువచెయ్యనివాడు ఏ మొహం పెట్టుకుని కట్నం అడుగుతాడూ? ఇప్పుడు పెళ్ళయితేనే చాలుననే ధోరణిలో పడ్డాడన్నమాట!"

"అతను మొదటినుంచీ 'కట్నం ఒద్దో' అనే అంటున్నాడు. తండ్రిని సమదాయించటానికని ఒప్పుకున్నాడు. ఆ తండ్రి మోరాయించినట్టుంది. మనం ఇచ్చేది చాలదని ఉంటాడని నా అనుమానం. ఇప్పు డతను కట్నంవిషయం పూర్తిగా వదిలేసుకున్నాడు," అన్నాడు అనుమయ్య, అచ్చగా భార్యను తృప్తిపరచేటందుకేగాక తనను తృప్తి పరుచుకునేటందుకు కూడాను.

గ్రంథం ఈ ఘట్టంలో ఉండగా ముకుందుడు వచ్చాడు. కుశాల్రావు వూళ్ళోకి వచ్చిన సంగతికూడా అతడికి తెలీదు. అందుచేత తల్లి అతనితో అంతా చెప్పి, అనుమయ్య అతనితో పెళ్ళి మానుకున్నటు చెప్పక పోవటమూ, కుశాల్రావు కట్నం లేకుండా పెళ్ళికి ఒప్పుకోవటమూ కూడా వివరించింది.

"కట్నం వద్దన్నాడూ? దొంగ ఎత్తయి ఉంటుంది," అన్నాడు ముకుందుడు.

"కట్నం కావాలనటం దొంగఎత్తు, వద్దనటమూ దొంగఎత్తే! ఇక దొరఎత్తు ఏదీ?" అని అనుమయ్య అడిగాడు.

"నువ్వు అతని పక్షం వకీలయినట్టూ, నేను కానట్టూ మాట్లాడకు, నాన్నా! అతనికి మనమంటే ప్రత్యేకాభిమానమా? కట్నం యిస్తేనేగాని పెళ్ళాడనని భీష్మించుకున్నా అతనికి మంచి సంబంధాలు రావచ్చు — బి. ఏ. పాసైనాడంటున్నావాయె, తండ్రికి కట్టుకుపోయినంత ఆస్తి వుందంటున్నావాయె! మనలో—మన చంద్రలో— ఏమిచూసి పెళ్ళికోసం అతను కాళ్ళావేళ్ళా పట్టుతున్నాడో నువ్వే ఆలోచించు!" అన్నాడు ముకుందుడు.

"ఆయన అంతమారం ఆలోచిస్తే ఇంకా లేనిదేం! వాడు వచ్చి కట్నం లేకుండా పెళ్ళి చేసుకుంటా ననేసరికి మానుకున్న పెళ్ళికాస్తా మళ్ళీ తలపెట్టారు, ఏం మనిషంట!" అన్నది కమలమ్మ.

తల్లీ కొడుకు లిద్దరూ మెల్లిగా ఒక తాటిమీదకి వస్తుండటం అనుమయ్య కళ్ళతో చూస్తున్నవాడులాగా గమనించాడు.

"మీ గొడవే మీది తప్ప యింకేమీ ఆలోచించ లేరు. ఈ పెళ్ళి మనకు వద్దనుకున్నాముకాని ఆ సంగతి అతనికి మనం రాయలేదు. అందుచేత యింకా మనం పెళ్ళి ప్రయత్నంలో వున్నామనే అతను అనుకుంటున్నాడు.

ఎలాగో మనస్సు మార్చటం కోసమని కష్టం వహించుకో వడం లేదు అతను. కాళ్ళా వేళ్ళా పడటం అనేది కూడా జరగదు. ఒకవేళ మనం పెళ్ళి మానుకున్నామంటే అతను బతుకు జీవుడా అని వెళ్ళిపోతాడేమో! మాటకు కట్టుబడి యీ సంబంధంమీదే వున్నాడేమో?" అన్నాడు అనుమయ్య.

ఈ లోపల మనం అతనికి ఏం ద్రోహం చేశామని అతను తన అభిప్రాయం మానుకోవాలి! ఒకసారి ఈ సంబంధం ఖాయమనుకున్నవాడు ఆ అభిప్రాయం మార్చుకోవడానికి కారణం ఏదో వుండాలిగా!" అన్నాడు ముకుందుడు.

"మనం ఏ కారణమూ లేకుండా అభిప్రాయం మార్చుకోలా?" అన్నాడు అనుమయ్య కసిగా.

"ఆ మాట అంటేనే నాకు బాగుండదు. మనం మన అభిప్రాయం మార్చుకోవడానికి బోలెడంత కారణం వుంది. నువ్వు రెండు ఉత్తరాలురాస్తే ఆ పెళ్ళికొడుకు తండ్రి అతీ గతీ లేదు. అసలు వాళ్ళు అతనిని గురించి చెప్పిన విషయాలలో ఏ ఒక్కటీ రుజువు కాలేదు. ఎంత గతిలేనివాళ్ళయితే మాత్రం పిల్లను దారేపోయేవాడి కిచ్చి చేస్తారా?"

తన ఓటమి ఖాయమని అనుమయ్యకు తెలిసి పోయింది. ఇంత సేపుమాట్లాడినా ఆయన తనభార్యాకొడుకూ నిర్ణయించిన ధోరణిలో వాదనను సాగనిచ్చాడేగాని తనకు కుశాలరావును గురించి అభిప్రాయం ఎందుకు మారిందో

అది వాళ్ళకు చెప్పలేకపోయాడు. అటువంటి విషయాలు చెప్పటం—అందులోను సానుభూతి లేకుండా మాట్లాడే వాళ్ళకు అర్థమయేట్టు చెప్పటం — అనుమయ్యకు పరమ అసహ్యాం. కొందరు దేశంకోసం ప్రాణాలు విడుస్తారు. అనుమయ్య తన హృదయానికి సంబంధించిన విషయాలు "విమర్శకులకు" చెప్పేకన్న చావటానికైనా ఒప్పుకుంటాడు. కుశాల్రావుపట్ల ఆయన హృదయం మెత్తబడింది. అందు చేత అతనిని నిందిస్తూ తన భార్యా, కొడుకూ అన్నమాట లన్నీ తనకే ద్రోహంలాగా వినబడినాయి.

"మనకు కావలసిన విషయాలన్నీ రుజువు చేసుకునే పెళ్ళి చేసుకుందాం. కావలిస్తే నువ్వు ఆ మంగళేశ్వర్రావు దగ్గిరికి వెళ్ళిరా. కాని కుశాల్రావు తండ్రి తెగతెంపులు చేసుకున్నట్టు కనబడుతున్నాడు. అందుకే అతను కట్నం వద్దనేశాడు. రుజువు చెయ్యటానికి ఇంకేమున్నది? మనిషి కనిపిస్తున్నాడూ, చూస్తే తక్కువ ఆలోచనలు గల వాడల్లే లేడూ! అంతకన్న ఎవరుమాత్రం ఏం చూసి సంబంధం చేస్తారూ?" అన్నాడు అనుమయ్య.

"అదీ కనిపించలేదే! నేనా మనిషి మొహంకూడా ఇంతదాకా చూడలేదు," అని ముకుందుడు అంటూండ గానే అతనికోరిక సిద్ధించింది.కుశాల్రావు లోపలికి వస్తూండ డం చూసి ఎదురు మండిగంలో నిలబడి నిర్లిప్తంగా వింటున్న చంద్రావతి లోపలికి వెళ్ళిపోయింది.

ముకుందుడు అతని కేసి దిగాలుపడ్డట్టుగా చూశాడు. కుశాల్రావు అంత డాబుగా ఉంటాడని అతను ఊహించ

లేదు. ఎరగని మనిషిని గురించి అభిప్రాయాలు పెంచుకున్న ప్రతి మనిషి కూడా ఆ మనిషి ఎదుట పడగానే ఆ అభిప్రాయాలను పునర్విమర్శించుకోవాల్సి వస్తుంది. ముకుందుడికి ఇప్పుడు అదే గతి పట్టింది, కుశాల్రావుది దొంగ మొహమని అతను ముందుగానే నిర్ణయించుకున్నాడు. అతని కళ్ళల్లో వుండే "ధైర్యం" చూసి ముకుందుడు బేజారెత్తి తన చూపు పక్కకు తిప్పేసుకోవలసి వచ్చింది.

"రావోయ్. వీడే మా అబ్బాయి, ముకుందుడు," అన్నాడు అనుమయ్య.

వెంటనే కుశాల్రావు ఆరు అడుగుల దూరంనుంచి ఒక్క అడుగే ముందుకువేసి తన పొడుగాటి చెయ్యి ముకుందుడుకేసి చాచి, "వెరీగ్లాడ్——" అన్నాడు.

అనుమయ్య తన చేతిగడియారం కేసి చూసుకుని "ఏమన్నరా!.... స్నానం చేస్తావా ?" అని కుశాల్రావును అడిగాడు.

కుశాల్రావు చేస్తానన్నమీదట ఆయన కూతుర్ని కేకేసి 'వేడినీళ్ళున్నాయా' అని అడిగాడు. కుశాల్రావు తనకు వేడినీళ్ళు అలవాటు లేదన్నాడు.

చంద్ర లోపలినుంచి వచ్చి, "నాన్నా, అమ్మ రమ్మంటున్నది," అన్నది.

వంటఇంట్లో కమలమ్మ మొగుణ్ణి, "అతను భోజనం చేస్తాడా ?" అని అడిగింది.

"ఎందుకు చెయ్యడూ! మనకు లేని ఏకాదశి అతని కేమిటి ?" అన్నాడు అనుమయ్య.

"అలా భోంచెయ్యకూడదు. కతికితే అతకదు!" అన్నది కమలమ్మ, రాజ్యాంగం వుద్ధరిస్తున్న దానిలాగా.

"అఘోరించకపోయింది! నీకు కావలసింది అదేగా? నువు పెళ్ళి చేయించేదానివి, నేను చెడగొట్టేవాణ్ణి ఎప్పుడైనాం?" అన్నాడు అనుమయ్య కసి తీర్చుకుంటూ.

"కూరా నారా కూడా సరిగాలేదు. ఏం వంట చేస్తానో నాకే తెలియటంలేదు," అన్నది కమలమ్మ.

"దారే పొయ్యేవాడికోసం వేరే చేసేదేమిటి? మనం ఏ పచ్చడి మెతుకులు తింటే అతనూ అవే తింటాడు," అన్నాడు అనుమయ్య.

తన భర్త ఈ ధోరణిలో తెల్లవార్లూ మాట్లాడగలడని కమలమ్మకు తెలుసు. అవతల పరాయివాడు వుండిపోయాడని తగ్గింది కాని, లేకపోతే తానుకూడా తన భర్త విషయం ఏమిటో అంతు తేల్చుకునేదే.

ఆ దంపతులు ఇరవైఏడేళ్ళనుంచీ అదేవిధంగా ఒకరి అంతు ఒకరు నిత్యమూ తేల్చుకుంటున్నారు.

అనుమయ్య తన భార్యతో మాట్లాడడానికి వెళ్ళిపోగానే కుశాల్రావు హాలు కలయజూశాడు.

తన బట్టలు విప్పి కోట్ స్టాండుకు తగిలిస్తున్న ముకుందుడు, "మీరు ఛేంజి చేసుకోరూ?" అన్నాడు.

"నా చేతిపెట్టె కోసం చూస్తున్నాను," అన్నాడు కుశాల్రావు.

"చేతిపెట్టెరూములో వుంచాను." అంటూ చంద్రావతి హాలులోనుంచి రూములోకి వెళ్ళి లైటు వేసింది.

కుశాల్రావు లోపలికి వెళ్ళి తన చేతిపెట్టె ముందు గొంతుకూర్చుని ఒక లుంగీ, బనీనూ పైకి తీశాడు.

చంద్రావతి అతని వెనక నిలబడి, "విడిచిన బట్టలు హాలులో తగిలించుకోవచ్చు. మనీపర్సు కావలిస్తే బీరువాలో దాస్తాను," అన్నది.

వెంటనే కుశాల్రావు తన మనీపర్సు తీసి ఆమె కిచ్చాడు.

"ఇంకేమైనా కావాలా?" అన్నది చంద్ర.

"అంతే!" అన్నాడు కుశాల్రావు. అతను తన సొంత తువాలూ, సబ్బుపెట్టె తీసుకుని బయలుదేరేలోపుగా ఆమె అతని పర్సు బీరువాలో పెట్టి తాళంవేసి అతనికి స్నానాల గదిని చూపటానికి వెంట వెళ్ళింది.

కుశాల్రావు స్నానంచేసి వచ్చేసరికి ముకుందుడు పొట్టిపంచా, షర్టూ ధరించి ఎక్కడికో బయలుదేరుతున్నవాడల్లే కనిపించాడు. అతను తనకోసమే వేచివున్నాడని గ్రహించి కుశాల్రావు గదిలో తన పనులు ముగించుకొని బనీనుమీద షర్టు తొడుక్కుని హాలులోకి వచ్చాడు. అతను ధరించిన బనీను దగ్గర్నుంచీ ప్రతీదీ చాలా ఖరీదైనదిగా ఉండటం ముకుందుడు గమనించాడు.

అతను కుశాల్రావుతో, "భోజనానికింకా టైమున్నట్టున్నది. అలా ప్లేగ్రౌండుదాకా వెళ్ళివద్దామా?" అన్నాడు.

ఇద్దరూ కలిసి ఒక ఫర్లాంగు దూరంలో వున్న ప్లేగ్రౌండుకు బయలుదేరారు. వాళ్ళు పేవ్మెంటుమీద

నడుస్తూంటే ఇద్దరు నవనాగరిక యువతులు నడ్డి ఆడించు కుంటూ వాళ్ళకు ఎదురు వచ్చారు. ఒక అమ్మాయి కుడి చేతిలో వున్న పేరసాల్‌ను ఎడంచేతికేసి కొట్టుకుంటూ ఏదో మాట్లాడుతూ తల ఆడిస్తున్నది. రెండో పిల్ల ఒకేసారి మాట్లాడుతూ నవ్వుతున్నది. తన చేతి సంచిని భుజంమీద వేసుకుంటూ, మళ్ళీ దించుతూ నడుస్తున్నది.

ఇద్దరు అమ్మాయిలూ కుశాల్రావుకేసి తెగ చూడటం ముకుందుడు గమనించాడు.

వీధిలో విద్యుద్దీపాల కాంతికన్నా వెన్నెల కాంతి హెచ్చుగా వున్నది. ఇంకా పౌర్ణమి రెండు రోజులు వుండటంచేత చంద్రుడు అప్పుడే బారెడు ఎత్తుకువచ్చాడు.

ఇంటిదగ్గర బయలుదేరాక ఇద్దరూ ఇంతవరకు ఏ సంభాషణ చెయ్యలేదు.

ముకుందుడు జేబులోంచి సిగిరెట్టుపెట్టె తీసి "సిగరెట్" అన్నాడు.

"నో. థాంక్స్! నేను స్మోక్ చెయ్యను," అన్నాడు కుశాల్రావు.

"నేను పరిమితంగా కాలుస్తాను. మా నాన్న ఎదట కాల్చను," అన్నాడు ముకుందుడు, తనను గురించి ఒక గొప్ప విషయం చెప్పుకుంటున్నవాడిలాగా. తన నోటి వెంట వచ్చే ప్రతిమాటా వినేవాళ్ళకి చాలా ఆసక్తితో విన బుద్ధి అవుతుందని ముకుందుడి కొక నమ్మకం వుంది.

కాని కుశాల్రావు, "ఓ, ఐ సీ," అన్నాడు పరధ్యానంగా.

కొంచెంసేపు అయ్యాక ముకుందుడు, "మీరు ఏ కాలేజీలో చదివారు?" అని అడిగాడు.

"బోర్‌స్టల్ స్కూల్లో చదివాను," అన్నాడు కుశాల్రావు.

ముకుందుడు తన చెవులను తానే నమ్మలేకపోయాడు.

"అవును. నేనూ, ఇంకా ఇద్దరు కుర్రాళ్లూ కలిసి ఒక కోమటిని కత్తులతో పొడిచాం. పాపం, కోమటి మూడురోజులు ఆస్పత్రిలో చావు బతుకుల్లో ఉండి చివరకు పోయాడు. నేను ఏడేళ్లవాణ్ణి. కోమటి అల్లుడు మాచేత ఆపని చేయించాడు. అతనికి ఇరవైఏళ్ళు వేశారనుకుంటాను. మమ్మల్ని బోర్‌స్టల్ స్కూలుకు పంపారు" అన్నాడు కుశాల్రావు.

ముకుందుడు ఎన్నో విషయాలు అడుగుదామను కున్నాడు. అతన్ని ఎంతో క్రాసుపరీక్ష చేద్దామను కున్నాడు. ఈ సంగతులు వినగానే అతని మనస్సంతా ఫ్రిజిడేర్‌లో పెట్టినట్టయిపోయింది.

"ఇదంతా మానాన్నకు తెలుసా?" అని అతను చివరకు అడిగాడు.

"ఇది గొప్ప రహస్యం ఏమీ కాదు. నేను వారితో మా కుటుంబ విషయాలు ఏవీ మాట్లాడనేలేదు. మా భద్రాచలం మామయ్య అన్నీ చెప్పానన్నాడు. ఈ సంగతి కూడా చెప్పే వుంటాడు," అన్నాడు కుశాల్రావు.

తరువాత ముకుందుడికి మాట్లాడేందుకు ఏమీ లేక పోయింది. ఎవరి యింట్లోనుంచో రేడియో పాడుతున్నది. ఆ పాట అయాక కుశాల్రావు, "ఈ హిందూస్తానీ తోడి దక్షిణదేశానికికూడ పాకింది," అన్నాడు.

"మీకు సంగీతంలో అభిరుచి వుందా ఏమిటి?" అన్నాడు ముకుందుడు.

"నాకు కర్నాటక రాగాలు అంతగా తెలీవు. హిందూస్తానీ సంగీతం చాలా యిష్టం," అన్నాడు కుశాల్రావు.

"గాయక హంతకుడు," అన్నాడు ముకుందుడు.

రేడియోలో ఇంకొక పాట పూర్తి అయ్యాక కుశాల్రావు, "మీరేదో చాలా సీరియస్‌గా ఆలోచిస్తున్నట్టున్నారే? ఏమైనా కబుర్లు చెబుతారనుకున్నాను," అన్నాడు.

"మనం యింటికిపోదాం, వంట అయివుంటుంది. మనకోసం నాన్న కనిపెట్టుకొని ఉంటాడేమో!" అన్నాడు ముకుందుడు. ఎక్కడా జనసంచారం లేదు. కుశాల్రావు తనమీదపడి గొంతులో కత్తి గుచ్చి "సీసా" కిందికి తన శవాన్నితోసేసి పారిపోయినట్టు అతను ఊహించుకున్నాడు. భయం వేసింది.

ఈ భయం ఇంటికి చేరేదాకా అతన్ని వెంబడిస్తున్నట్టే వుంది. రెండు మూడుసార్లు అతను కుశాల్రావు కుడి చేతికేసి చూశాడు. రక్తం మరకలు లేకపోవడం ఆశ్చర్యకరంగా కనబడింది.

వాళ్ళు తిరిగి వచ్చేసరికి యింటిముందు కారొకటి నిలబడి వున్నది. "అది సర్వేశ్వర్రావుగారి కారు. సెక్రె టేరియట్‌లో పని చేస్తారు. మా నాన్నకు చిన్ననాటి స్నేహితుడు. ఎప్పుడైనా వస్తూంటారు," అని ముకుందుడు కుశాల్రావుతో చెప్పాడు.

సర్వేశ్వర్రావూ, ఆయనభార్యా, ఇద్దరుకూతుళ్లూ, రెండేళ్ళ కొడుకూ అంతకుముందే వచ్చారు. రేపు పిల్లవాడి పుట్టినరోజు పండుగ అని పిలిచి పోవడానికి వచ్చారు.

"ఒరే సర్వా, అన్నట్టు మా చంద్రికి సంబంధం చూస్తున్నాం. అతను ఈపూట యిక్కడే ఉన్నాడుకూడా. వాడూ, మా ముకుందుడూ కలిసి వెన్నెల షికారుకు వెళ్ళి నట్టుంది," అన్నాడు అనుమయ్య.

"నువ్వే ప్రయోజకుడ వనిపించావురా ? మా రుక్మి ణికి మొగుడు దొరక్కుండా వున్నాడు. కాస్త చూసి పెడుదూ!" అన్నాడు సర్వేశ్వర్రావు.

అంతలోనే కుశాల్రావూ, ముకుందుడూ తిరిగి వచ్చారు.

కుశాల్రావును చూస్తూనే సర్వేశ్వర్రావు, "నీ పేరేవరోయ్ ? ఎక్కడో చూసినట్టుందే మొహం," అన్నాడు:

"నా పేరు కుశాల్రావండీ!" అన్నాడు కుశాల్రావు.

"నేను రెండేళ్ళు లెక్చరర్ అఘోరించాలే. నాకు గాని స్టూడెంటువు కాదుగదా?" అన్నాడు సర్వేశ్వర్రావు.

"మీరు బోర్‌స్టల్ స్కూల్లో లెక్చరర్‌గా పని చేశారా ఏమిటి ?" అని ముకుందుడు అడిగాడు.

"అలాగా ? నువ్వు బోర్‌స్టల్ స్కూలు విద్యార్థివా ? వెరీ యింటరెస్టింగ్ !... మా సూపర్నెంటు దుర్గారావు లేడూ ? అతను బోర్‌స్టల్ ప్రాడక్టే! చాలా కల్చర్డ్ ఫెలో!" అన్నాడు సర్వేశ్వర్రావు అనుమయ్యతో.

ఆయన భార్యా, పెద్ద కూతురు రుక్మిణీ కుశాల్రావును కన్నార్పకుండా చూస్తూన్నారు.

"ఏమన్నా ఉద్యోగం చేస్తున్నావుటోయ్ ?" అని సర్వేశ్వర్రావు కుశాల్రావును అడిగాడు.

"లేదండీ, నాకు ఉద్యోగాలు చెయ్యటం అంతగా యిష్టం లేదు. యిన్స్యూరెన్స్ ఏజెంటుగా కొద్దిగా సంపాదిస్తున్నాను. మూడులక్షల బిజినెస్ చేయించాను. స్వతంత్రంగా బతకటానికి యిటువంటి పట్టణంలో చాలా మార్గాలున్నాయి," అన్నాడు కుశాల్రావు.

"మాకన్న నువ్వే వివేకివి సుమీ ! నేనూ, మా అనుమయ్యా చూడరాదూ ! ఎక్కడ వేశావే గొంగడీ అంటే వేసినచోటే అన్నట్లున్నాం.... ఏరా, అనుమయ్యా ! ఈ అబ్బాయిని నా కిచ్చేసి నువ్వింకో సంబంధం చూసుకో రాదూ ? కట్నం బాగా కుమ్మరించేస్తున్నావా ఏమిటి ? అది నావల్ల కాదు," అన్నాడు సర్వేశ్వర్రావు పరిహాసధోరణిలో.

"అతనికి కట్నం సరిపడదుట !" అన్నాడు అను మయ్య.

"వెల్, విష్ యూ ది బెస్టాఫ్ లక్, యంగ్ ఫెలో !" అంటూ సర్వేశ్వర్రావు లేచి నిలబడి, కుశాల్రావు చెయ్యి తీసుకుని గట్టిగా నొక్కాడు. తరవాత ఆయన చంద్రను కాస్సేపు ఏడిపించి, తన బలగాన్ని పోగుచేసుకుని కారెక్కి వెళ్ళిపోయాడు.

సర్వేశ్వర్రావు ప్రవర్తన ముకుందుణ్ణి చాలా ఆశ్చర్య పెట్టింది. ఆయన వివరాలు ఎందుకు అడగలేదూ! కోమటివాడిహత్య గురించి తెలిసివుంటే యిలాగే మాట్లాడే వాడా ? పైపెచ్చు తన కూతుర్ని యిస్తానంటాడేమిటి ? ఏదో మాటవరసకు అని వుంటాడు. మాటవరసకు తన కిస్తానని ఆయన ఎన్నడూ అనలేదే ? యిన్నేళ్ళుగా తనను ఎరిగి వుండికూడా ఈ కుశాల్రావుతో మాట్లాడినంత ఆప్యాయంగా ఆయన తనతో ఎన్నడూ మాట్లాడక పోవడానికి కారణం ఏమిటి ? తనుకూడా ఏ హత్య అయినా చేసి ఉంటే సర్వేశ్వర్రావుకు తనపైన గౌరవం ఏర్పడి, తన కూతుర్ని యిచ్చి పెళ్ళి చేస్తాననేవాడేమో !

"ఓల్డ్ ఫూల్ !" అనుకున్నాడు ముకుందుడు. తనకు నచ్చనివాళ్ళపైన ముకుందుడికి అపరిమితమైన తృణీకార భావం.

•

భోజనాలైపోయిన వెంటనే కుశాల్రావు హాలులో ఒక పక్కగా నవారు మంచం వేసుకుని, పడుకుని వెంటనే

నిద్రపోయాడు. మిగిలిన వాళ్ళందరూ దూరంగా దొడ్లో చేరి మాట్లాడుకున్నారు.

"....హత్య చేశాట్ట !....ఎవరో కోమటిట...." అని ముకుందుడు చెప్పుకుపోయాడు.

"....పసితనంలో ఏమేమో చేస్తాం. నేనూ మా తాతయ్య సంచిలోనించి డబ్బులు కాజేసేవాణ్ణి!" అన్నాడు అనుమయ్య.

"చాల్లే వూరుకోండి ! చిన్న పిల్లలందరూ హత్యలు చేస్తున్నారా ఏమిటి?" అన్నది కమలమ్మ.

"ఇది తెలియటం మంచిదయింది," అన్నాడు ముకుందుడు, దైవికంగా ఈ రహస్యాన్ని తెలుసుకున్న వాడిలాగా.

"చచ్చినా ఈ సంబంధం వీల్లేదు !" అన్నది కమలమ్మ. "ఏ అర్ధరాత్రి ఎవరిగొంతు కోస్తాడో ! ఇంకేమైనా ఉందా ?"

"ఒంటరిగా అతనూ, నేనూ ఆ ప్లేగ్రౌండ్సులో కూచునివుంటే హడలిపోయా ననుకో !" అన్నాడు ముకుందుడు.

"కాదా మరీ ?" అన్నది కమలమ్మ.

"మనకు అక్కర్లేకపోతే సర్వేశ్వరరావుతో నన్నా చెబుదాం!" అన్నాడు అనుమయ్య.

"అనగానే సరా ఏమిటి ? నిజంగా రుక్మిణిని ఇస్తామా ? ఇయ్యమనండి చూద్దాం !" అన్నది కమలమ్మ.

"ఇస్తానని ఎందుకన్నా డంటావ్ ?"

"ఎందుకా ! మనని గోతిలో దించడానికి ! తను ఆమాటంటే మనం మరింత ఉత్సాహంగా మన అమ్మాయి నిస్తాంగదా అని !"

"అందువల్ల వాడికేం ఒరుగుతుందీ ?"

"అదేమో !" అన్నది కమలమ్మ.

"ఓల్డ్ ఫూల్ !" అన్నాడు ముకుందుడు తృప్తిగా.

"మీతో మాట్లాడటం శుష్కదండగ ! బోర్ స్టల్ స్కూళ్ళలో తయారయినవాళ్ళు గొప్పగొప్ప ఉద్యోగాలు చేస్తున్నారు. కాని ఆ విషయం మీవంటి కూపస్థ మండూకాలకు చెప్పి ప్రయోజనం లేదు!" అన్నాడు అనుమయ్య.

"అయితే, ఇంతకూ మీరనేది హంతకుడైనా సరే పిల్లనిస్తా మంటారుటండీ ! నే నెక్కడా యిలాటి విడ్డూరం చూడలేదు. మీ కేమైనా వాడు మందు పెట్టలేదు గద !" అన్నది కమలమ్మ నిజమైన ఆశ్చర్యంతోనే.

"నా కేమీ తెలీదు ! మీయిష్టంవచ్చినట్టు ఏడుచుకోండి," అంటూ అనుమయ్య లోపలికి వచ్చేశాడు.

"ఈయన ధోరణి నా కేమీ అర్థం కాలేదు. నీ కేమైనా అర్థమయిందిట్రా ?" అని తల్లి ముకుందుణ్ణి అడిగింది.

"నాన్న వొట్టి గుడ్డి మాలోకం ! వీడి కెవరూ పిల్ల నివ్వరు. అందుకే మన కాళ్ళావేళ్ళాపడి ఏడుస్తున్నాడు," అన్నాడు ముకుందుడు.

చంద్ర అంతా విన్నది. ఎవరి మాటలూ ఖాతరు చెయ్యలేదు. తానుమాత్రం కుశాల్రావునే చేసుకో దలుచుకున్నది. తనకు పెళ్ళి జరిగి తీరుతుందనికూడా ఆ పిల్లకు నమ్మకమే.

# 3

అనుమయ్య పదకొండున్నర ప్రాంతాల సెక్రటేరియట్‌కు టెలిఫోన్‌చేసి సర్వేశ్వర్రావు కోసం అడిగాడు. అదృష్టవశాత్తు సర్వేశ్వర్రావు అందాడు.

"ఏంగా, సర్వా? నీ చెవినికూడా వేద్దామని పిలిచాను. ఆ కుశాల్రావు సంబంధం వదులుకుందామనుకుంటున్నాం.... ఆ కారణం ఒక్కటే కాదులే! అతనికి అనుకూలంగా ఒక్క విషయమూ లేనిదే!.... అతను నిక్షేపమల్లేనే ఉన్నాడనుకో, అది ఒక్కటే చూసి ఎలా ఇస్తాం చెప్పూ! ఒక్కగా నొక్క పిల్ల!.. ఏమిటీ? పిల్ల ఉద్దేశమా, ఆఁ దాని మొహం! దానికేం తెలుస్తుంది? కుర్రాడు తెల్లగా, స్టయిలిష్‌గా ఉండట చూసి అది తృప్తిపడితేమాత్రం ఏమైనట్టూ?... నా సొంత అభిప్రాయమా? అబ్బాయ్, ప్రస్తుతం నా బుర్ర కొత్తిగా పనిచెయ్యటం లేదు. మా ఆవిడా, మా ముకుందుడూ.... రెండు తరాల వాళ్ళతో సేస్తున్న సంబంధం! మోరాయించి, వాళ్ళకు అసంతృప్తి తెప్పించి చెయ్యటం నా కిష్టం లేదు. రేపే

దన్నా అయినా అందరూ! నన్ను దుమ్మెత్తిపోస్తారు! ఏమంటావ్ ?"

ఆ చివర సర్వేశ్వర్రావు చాలసేపు ఏమీ మాట్లాడక పోవటంచూసి అనుమయ్య, "ఉన్నావా అక్కడా ?" అని అనుమానంగా అడిగాడు.

"వున్నాను, వున్నాను! ఆలోచిస్తున్నాను. బహుశా నువుచేసిన నిర్ణయమే మంచిదేమో! అతన్ని సాగనంపారా? యింకా యింట్లో వున్నాడా ?" అని సర్వేశ్వర్రావు అడిగాడు.

"యింకా సాగనంపలేదు. పిల్లికి గంట ఎవరు కట్టాలన్న సమస్య ఉంటుందిగా ? 'నీ సంబంధం మాకు వద్దులేనాయనా !' అని చెప్పేబాధ్యత నామీద పెట్టారు మావాళ్ళు. నేను ఆఫీసుకు బయలుదేరేటప్పుడే వెంట పెట్టుకునివచ్చి దారిలో చెబుదామనుకుంటే కుశాల్రావు ఎనిమిదిన్నరకు బయటకువెళ్ళి మళ్ళీ తిరిగిరాలేదు. ఒకవేళ లంచిటైముకు ఇక్కడికి వస్తాడేమో. అప్పుడు చెప్పేద్దామనుకుంటున్నాను. నీ సలహా చెప్పెయ్యమనేగా ?" అన్నాడు అనుమయ్య.

"చెప్పెయ్యి, తప్పేం ? కాని చూడు అనుములూ! అతన్ని ఒక్కసారి ఇవాళ సాయంకాలం మీ వాళ్ళతో బాటు మా యింటికి పంపిస్తావూ ? భోజనానికి రమ్మన్నాననే చెప్పు !" అన్నాడు సర్వేశ్వర్రావు.

అనుమయ్యా రక్తం ఒక్కసారి చల్లబడ్డట్లయింది. నిన్నరాత్రి తను యింటికి వచ్చినప్పుడు సర్వేశ్వర్రావు తన కూతురు రుక్మిణిని కుశాల్రావు కిస్తానన్నప్పుడు అది ఛలోక్తి కిందనో, వ్యంగ్య అభినందన కిందనో వెళ్ళిపోయింది. కాని యిప్పుడు సర్వేశ్వర్రావులో అనుమయ్యకు పచ్చి స్వార్థమూ, లౌక్యమూ కనపడినై. కుశాల్రావుకు తన కూతుర్నిఇచ్చే ఉద్దేశంతోనే ఆయన తనను సంబంధం మానుకోమని సలహా యిచ్చాడు !

"ఓ ! అలాగే ! మావాళ్ళు ఏ అయిదింటికో బయలుదేరి వస్తారనుకుంటాను. నేను ఆఫీసునుంచి నేరుగా వస్తున్నాను. వీలైతే అతన్ని నా వెంట తీసుకువస్తాను. లేకపోతే ఆరుగంటల ప్రాంతాల మీ యింటికి రమ్మని ఎడ్రసిస్తాను. అతను ఒకవేళ నాకు సాయంకాలం దాకా కనిపించకపోతే ఏం చెయ్యమన్నావు ?" అని అనుమయ్య అడిగాడు.

"అంతగా అయితే రేపు ఉదయం రమ్మను. అన్నట్టు రేపు ఆదివారం కదూ ? యివాళ నువ్వు సాయంకాలందాకా ఆఫీసులోనే ఉంటున్నావా ?"

"వుంటున్నాను. కొంత అన్‌లోడింగ్ పని వుంది," అన్నాడు అనుమయ్య.

టెలిఫోను పెట్టేసి కుర్చీలో చేరగిలబడి ఆయన చాలాసేపు ఆలోచించాడు. ఈ సంబంధం విషయంలో

తాను పప్పులో కాలు వెయ్యరాదు. సర్వోదు వెర్రికుట్టె కాడు. రుక్మిణికి ఎవడు దొరికినా అంటగట్టే కక్కుర్తిలో ఉన్నవాడు అసలే కాడు. ఆ మాటకు వస్తే కూతురి పెళ్ళి విషయంలో తాను పడిన మథనలో ఎన్నోవంతో అతను పడటంలేదు. పైపెచ్చు రెండు, మూడు సంబంధాలు తిరగ గొట్టాడు కూడాను.

అతను కుశాల్రావులో తాను చూడనిది ఏమన్నా చూసి ఉంటాడా ?

కుశాల్రావుకు ఒక్కటీ అనుకూలంగా లేదు అన టంలో అనుమయ్య కొద్దిగా అబద్ధం ఆడాడు. మామూ లుగా "జామాతా దశమో గ్రహః" అన్నసామెత చాలా మంది అల్లుళ్ళకు వర్తిస్తుంది. కుశాల్రావు ఆ జాబితాలోకి వచ్చేటట్టు కనపడడు. అత్తవారిమీద దాష్టీకంచేసే ధోరణి అతనిలో మచ్చుకు కూడా లేదు. అతనికి కట్నాలమీద కాంక్ష లేకపోవటం మొదట్లో సుగుణంగానే కనబడింది— తరువాత అది అతని అసర్వాతకు చిహ్నంగా పరిణమించి నప్పటికీ.

"నా కింకా కొంచెం వ్యవధి కావాలి. యింకా ఆలోచిస్తేనేగాని కుశాల్రావు సంబంధం చేసుకోనటమో, మానటమో తేల్చుకోవటం సాధ్యంకాదు !" అను కున్నాడు అనుమయ్య.

కాని తాను ఒక్కడూ తేల్చుకుని ఏం లాభం ! అవతల తన భార్యను ఒప్పించాలిగద ! సర్వోదు తనకో

టెలిఫోనుమీద అన్నమాటలు వింటే కమల తన మనస్సు మార్చుకుంటుందా? ఇన్నేళ్ళుగా తాను ఆమెతో కాపరం చేస్తున్నప్పటికీ ఏ పరిస్థితిలో ఎట్లా ప్రవర్తిస్తుందో తనకు తెలియకపోయె!

కొంచెంసేపు గుంజాటన పడినాక అనుమయ్యలో ఒక రియాక్షన్ వచ్చేసింది.

"ఛీ! ఏమిటీ పీడ! కావలిస్తే ఈ కుర్రాణ్ని పోనిస్తాం! ఒకవంక వీడు పనికివస్తాడా లేదా అని తేల్చుకో లేక చస్తూ, ఇంకో వంక వీడు చెయ్యి దాటిపోతే కొంప మునిగిపోతుందన్నట్లు దిగులు పడట మేమిటి? కుశాల్రావును సర్వాడి ఇంటికి పంపేస్తాను. వాడు ఇతణ్ణి తనకేసి తిప్పుకోని—నా సమస్యకూడా తీరిపోతుంది. నా నోటి మీదుగా నేనేమి చెప్పనక్కరలేదు" అనుకున్నాడు అనుమయ్య.

అప్పటికీ ఆయన మనస్సుకు పూర్తిగా ఊరట చిక్కలేదు.

పన్నెండు దాటినాక కుశాల్రావు వచ్చాడు. అతని మొహంలో ఏదో విషాదం గోచరించింది.

"ఏమైనాయ్? ఇంటినుంచేనా? భోంచేశావా?" అని అడిగాడు అనుమయ్య.

కుశాల్రావు ఈ ప్రశ్నలు విన్నట్లు కూడా కనపడ లేదు. అతడు ఏదో దారుణమైనవార్త మోసుకు వస్తున్నా డని అనుమయ్యకు ఎందుకో అనిపించింది. ఒకవేళ తన

భాగ్యంగాని సుప్తకుడుగాని అతన్ని ఏమన్నా అన్నారేమో ననుకున్నాడు. ఆ ఆలోచన రాగానే ఆయనకు చచ్చే సిగ్గేసింది. తన పెళ్ళాంకోసమూ, కొడుకుకోసమూ అంతో ఇంతో సిగ్గు పడుతూండటం ఆయనకు పరిపాటే.

"నా మూలంగా మీ పని చెడగొట్టుకోకండి. నే నింతవరకు మనసిచ్చి మీతో నా విషయాలు చెప్పుకో లేదు. చెప్పుకోటం అవసరంగా కనబడుతున్నది" అన్నాడు కుశాల్రావు.

"ఓ, దానికేం? ఒంటిగంటకు బయటకుపోదాం. ఈ లోపుగా అర్జంటుపని ముగించుకుంటాను" అన్నాడు అనుమయ్య లోలోపల కుంగిపోతూ.

ఇంటిదగ్గర ఏదో జరిగింది? సందేహంలేదు. ఈ కుశాల్రావు అలిగి లేచిపోక తన కెందుకు జిడ్డుపట్టిస్తు న్నాడు? కొంపతీసి ఇతనికి ఆత్మాభిమానం లేదా ఏమిటి? తనకు సులువుగా సంబంధం దొరికిందని సంతోషించి నందుకు భలే బెడదే వచ్చిపడిందే!

ఎదటి గోడమీద గడియారం ఒంటిగంటకింకా అయిదు నిమిషాలుండనగా అనుమయ్య లేచాడు. అతనితో బాటు కుశాల్రావుకూడా లేచాడు.

పేవ్మెంటు వెంబడి కొద్దిదూరం నడిచాక కుశాల్రావు ఆగి, "చూడండి! నేను అసలు పెళ్ళిగురించి ఎందుకు తల పెట్టానో మీతో చెప్పలేదు. నా దురదృష్టం కొద్దీ అందరూ ఉండికూడా ఎవరూ లేనివాడిలాగా

కొత్తగా బంధువులను ఏర్పరచుకొని, ఒక కుటుంబ ఏర్పాటు చేసుకోవలసి వచ్చింది. మీరు నాకు ఏమిచ్చినా నేను దానిమీద ఆధారపడ దలచలేదు. నాకు అవసరమైన డబ్బేదో నేనే సంపాదించుకుంటున్నాను. ఖర్చు చేసుకుంటు న్నాను. బతికేదేదో బాగానే బతకాలని నా ఉద్దేశం. నాకు ప్రేమలోనూ, ప్రణయంలోనూ నమ్మకంలేదు. మను షులు మంచివాళ్ళయితే చాలు నాకు. నాకు తల్లిదండ్రుల్లాగా ఉండే అత్తమామలూ, నాతో సఖ్యంగా ఉండే భార్యా దొరకాలని మాత్రమే నేను కోరింది. నా ప్రకటనకు జవా బుగా మీరు రాసిన ఉత్తరం నాకు కపటం లేకుండా ఆప్యా యంగా కనపడింది. మీ అమ్మాయిని చూపినప్పుడుకూడా ఎవరో నాకు దగ్గర బంధువనిపించింది గాని, పరాయి మనిషి అనిపించలేదు. నేను సంబంధం ఆనాడే స్థిరం చేసు కున్నాను. ఆ తరవాత ఒక్క క్షణంపాటు కూడా ఆ నిర్ణయాన్ని మార్చుకోలేదు. [illegible] ఇవాళ —" అని ఆపాడు.

అనుమయ్య అనుమానం రూఢి అయినట్టయింది. అయినా లాంఛనంగా "ఏం జరిగిందేమిటి?" అన్నాడు.

"నిన్న సాయంకాలం మీ అమ్మాయి చేతికి నా పర్సిచ్చి దాచమన్నాను. బీరువాలో దాచటం కూడా చూశాను. అందులో అయిదు నూరురూపాయలనోట్లూ కొద్దిగా చిల్లరనోట్లూ పెట్టాను. మీరు ఆఫీసుకు వెళ్ళిన కొద్దిసేపటికి నేను ఇంటికి వచ్చి పర్సు తీసుకున్నాను.

అందులో ఒక నూరు రూపాయల నోటు పోయింది" అన్నాడు కుశాల్రావు.

అనుమయ్య ఏదో అనబోయిన వాడిలాగా నోరు తెరచి అలాగే ఉండిపోయాడు.

"నూరు రూపాయలు పోయినందుకు నేను మనో వ్యాధి పడడంలేదు. ఆ డబ్బు నేను ఆట్టే చెమటవోడ్చి సంపాదించినది కాదు. కాని నా యిల్లులాటి దనుకున్న చోట దొంగతనం——"

"మా అమ్మాయి ఎన్నడూ దొంగతనం చెయ్యదే" అన్నాడు అనుమయ్య.

"ఆ విషయం నేను నమ్మగలను. ఒక నూరు రూపాయల నోటు కనిపించటంలేదని నాకు ఆ పిల్లే చెప్పింది. నిన్న నేను పర్సిచ్చినప్పుడే అణా పైసలతో సహా ఎంచి పెట్టిందట. చాలా జాగర్త మనిషిలాగా కనిపిస్తుంది. ఈ పూట నేను పర్సు అడిగినప్పుడు మళ్ళీ ఎంచింది. తానే పొరపాటుపడ్డా ననుకొని నూరు రూపాయలు నాలుగా అయిదా ఉండాలని అడిగింది. అయిదన్నాను. అయితే ఒకటి పోయిందని చెప్పింది."

అనుమయ్య మొహం జేవురించింది. దొంగతనం చేస్తే సుపుత్రుడు ముకుందుడే చేసి ఉండాలి! వెధవ, ఎందుకు చేశాడాపని?

"చూడవోయ్, నే నీ విషయం ఇంతటితో వదలను. నీ డబ్బెక్కడికీ పోదు. మా ఇంట్లో పోయిన

డబ్బు అచ్చుకోవలసినవాణ్ణి నేనూ! తెలిసిందా" అన్నాడు అమమయ్య.

"నా ఉద్దేశం మీరు అర్థం చేసుకోలేదు. నాకా నూరురూపాయలు తిరిగి రాకపోయినా ఫరవాలేదు. కాని మీ యింట్లో ఎవరికో నేనంటే ఇష్టంలేదు. లేకపోతే నా పర్సులోంచి డబ్బు తీయరు. నన్ను బాధిస్తున్నది అదే!" అన్నాడు కుశాల్రావు.

కుశాల్రావు వ్యక్తంచేసిన భావం అనమయ్యకు లౌకికానుభవానికి ఎంత ఎడ అయిపోయిందంటే, అతను ఏమంటున్నాడో కూడా ఆయనకు అర్థం కాలేదు. ఆయన దృష్టిలో డబ్బు డబ్బే. దొంగతనమంటే ఇంకొకరికి డబ్బు మీద గల హక్కుకు హాని వాటిల్లజేయటం. దొంగతనానికీ ఇష్టాయిష్టాలకూ సంబంధ మేమిటో ఆయనకు తెలియ లేదు.

"అదేంమాట! నీ వందా నీకు రావాలిసిందే. అది వచ్చేటట్లు చూసే భారం నాదీ!" అన్నా డాయన.

కుశాల్రావు కొద్దిగా నవ్వాడు.

"దొంగతనం గురించి విచారణ జరుపుతారా! నా దగ్గిర అయిదువంద లుండాలన్న దానికి నేను చెప్పేమాట లేగా సాక్ష్యం? మీ అమ్మాయికి కూడా అనుమానం వచ్చి నన్నడిగింది. నేను నాలుగు వందలే ఉంచుకుని అయిదు వందలుండాలంటున్నానేమో! ఈ విషయం ఇంతటితో పోనివ్వండి" అన్నా డతను.

"పోనిచ్చి ?" అన్నాడు అనుమయ్య.

"నేను ఇంకా కొన్నాళ్ళు పట్నంలో ఉంటాను. కాని ఇది జరిగినాక మీ ఇంట్లో ఉండటం భావ్యం కాదు. మీ అనుమతి అయితే నేను ఈ రాత్రికే ఇంకొక చోటికి పోతాను. నా మూలంగా మీకు శ్రమ కలిగివుంటే క్షమించండి. మీ అమ్మాయికి ఇంకొక సంబంధం చూసేటప్పుడైనా మీ ఆదరానికి పాత్రుడయేవాడుగా చూసి మరీ నిశ్చయించుకోండి!" అన్నాడు కుశాల్రావు.

అతను తాను అనవలసిన మాట- అందామనుకున్న మాట-అనేస్తున్నాడని అర్థం కాగానే అనుమయ్య నిర్ఘాంత పోయాడు. పరిస్థితి ఇట్లా తలకిందులవుతుందని ఆయన కలలోకూడా అనుమానించలేదు.

తన పని కుశాల్రావే చేసిపెట్టినందుకు సంతోషించాలో, కుశాల్రావు చెయ్యిజారి పోతున్నందుకు విచారించాలో అనుమయ్య తేల్చుకోలేకపోయాడు.

"ఎందుకోయ్ అంత తొందరపడతావూ ? నూరు రూపాయలు పోయినందుకు నీకు లక్ష్యం లేకపోవచ్చు. కాని, నా దృష్టిలో చాలా ఘోరం జరిగింది. అతిథి సొమ్ము ! దాన్ని గురించి ఇంటి పెద్దగా నేనుచేసే విచారణ చేసితీరాలిగదా !" అన్నాడు అనుమయ్య.

"మీరు ఏం చేసుకున్నా నాకు ఒకటే. మీ ఇల్లు వదిలిపెట్టి వెళ్ళిపోవటానికి మాత్రం నాకు అనుమతి ఇవ్వండి !" అన్నాడు కుశాల్రావు.

అకస్మాత్తుగా అనుమయ్యకొక అనుమానంవచ్చింది- ఇదంతా దొంగ యెత్తా? సర్వుడు అప్పుడే వీణ్ణి తన వలలో వేసేసుకున్నాడా? రుక్మిణి రంభ కాకపోవచ్చుగాని చంద్రికన్న కొంచెం మెరుగే! వీడు చూడబోతే బంధు ప్రీతికొద్దీ పెళ్ళాడుతున్నా నంటున్నాడు. సర్వుడికి కూడా పెద్ద బలగం ఉన్నది—

అంతా బాగానే ఉన్నదిగాని సర్వుణ్ణి వీడు కలిసి ఉండే వ్యవధి ఏదీ, తాను సర్వుడితో టెలిఫోన్‌లో మాట్లాడటం పూర్తి చేసేసరికి పదకొండుముప్పావు అయి వుంటుంది. అప్పటిదాకా తాను సర్వుడితో ఈ సంబంధం అనుమానంలో పడిందని అననుకూడా లేదాయె. ఈలోపుగా వీళ్ళిద్దరూ కలుసుకుని మాట్లాడి, పన్నెండు దాటిన కాసేప టికి వీడు తన ఆఫీసులో అడుగుపెట్టే అవకాశం ఏదీ? అదీగాక వీడు ఇంటినుంచి ఎప్పుడు బయలుదేరాడో సులు వుగా ఆరా తీయవచ్చు. ఇదంతా ఇలా ఉండగా నూరు రూపాయలు పోయిన సమాచారం ఒకటి ఉందే-అదంతా వీడి కల్పనే అయితే తప్ప—

వాడేమంటే అన్నాడూ? తన దగ్గర అయిదువంద లున్నట్లు తనమాటే తప్ప వేరే సాక్ష్యం ఏముందనా?

చిత్రం! వీడు చిన్నతనంలో హత్యచేసిన విషయాని కూడా వీడు చెప్పిన మాటలు తప్ప వేరే ఆధారం లేదుగదా?

దీన్నిబట్టి ఏదో అనుకోవాలసి అనుమయ్యకు స్ఫురించింది. గాని ఏమనుకోవాలో ఎంతకూ స్ఫురించలేదు. అందుచేత ఆ విషయాన్ని అంతటితో పోనిచ్చాడు.

"బాబ్బాబు, నీకు పుణ్యం ఉంటుంది. నీకు మా ఇంట్లో ఉండటం కష్టమైతే రేపటిదాకా కాస్త ఓపికపట్టు. ఎంచేతంటే, ఇవాళ సాయంకాలం మా సర్వేశ్వరరావు కొడుకు పుట్టినరోజు పండగ. రాత్రికి అందరం వాళ్ళింటికే పోతున్నాం. నిన్నకూడా తీసుకురమ్మని వాడు మరీ, మరీ చెప్పాడు. సరేనని మాట యిచ్చాను. ఏకీ టెలిఫోనులో వాడితో మాట్లాడానో లేదో ఇంతలోనే నువ్వు వచ్చావు" అన్నాడు అనుమయ్య.

"సర్వేశ్వరరావుగారా? ఎక్కడో విన్న పేరులాగుందే!" అన్నాడు కుశాలరావు.

"నిన్న రాత్రి మనింటికి రాలా?"

"అవునవును! జ్ఞాపకం వచ్చింది. అబ్బో, ఆయన చెడ్డ గడుసువాడు-దేశాంతకుడు!" అన్నాడు కుశాలరావు.

అనుమయ్య ఆశ్చర్యంతో, "ఈ సంగతి నీకెలా తెలిసిందీ" అన్నాడు.

"మనిషిని చూస్తే తెలియదండీ?" అన్నాడు కుశాలరావు.

"నేనెలాటివాణ్ణి?" అన్నాడు అనుమయ్య.

"మీది కపటంలేని స్వభావం. సత్యం మీ వైపే ఉన్నా కూడా అసత్యవాదులకు లొంగిపోతారు. అది

మీలో దౌర్బల్యం అంటాను. కాని చెడు లక్షణం కాదు. మిమ్మల్ని మీవంటివాళ్ళు అర్థంచేసుకోవలసిందే గాని, మీతో వ్యతిరేకించేవాళ్ళు అర్థం చేసుకోలేరు. అందువల్ల నష్టంకూడా లేదంటాను. ప్రపంచంలో అందరూ తమను అర్థంచేసుకోవాలని తాపత్రయపడేవాళ్లు వట్టి మూర్ఖులు!" అన్నాడు కుశాల్రావు.

ఇద్దరూ కలసి హోటలుకు వెళ్ళారు.

"నేను భోజనంచేసి మీ ఆఫీసుకు వచ్చాను. భోజనం చేసేటప్పటికి పన్నెండయింది. మీకు తోడుగా కాఫీ మాత్రం తాగుతాను!" అన్నాడు కుశాల్రావు.

అతను హైకోర్టు ప్రాంతంలోనే ఎక్కడో హోటల్లో అన్నంతిని వుంటాడని అనుమయ్య గ్రహించాడు. సర్వేడు అతనితో మాట్లాడి ఉండటం కూడా అసంభవమని తేలి పోయింది.

అనుమయ్యకు కుశాల్రావు సమస్య మాత్రం ఒక్క వెంట్రుకవాసికూడా ముందుకు జరగలేదు. అది ఉన్న చోటనే ఉన్నది!

"నేను ఏ నిర్ణయమూ చెయ్యను. ఏది జరగాలని రాసిపెట్టి ఉంటే అదే జరుగుతుంది!"

ఈమాట అనుకున్న మరుక్షణం అనుమయ్యకు జ్ఞాపకం వచ్చింది. ఇప్పుడు కుశాల్రావు తనకు కాబోయే అల్లుడు కాడనీ, అతను అంతకుముందే తమ సంబంధాని కిన్నితిలోదకాలు విడిచాడనీనూ!

ఇది జ్ఞాపకం రావటంతో అనుమయ్య ఆరాటం జాస్తి అయింది. "నీ కూతుర్ని చేసుకునే ఆలోచన మాను కున్నాను" అని అతను అన్న మరుక్షణం ఇద్దరూ చెరొక దారినా వెళ్ళిపోక సఖ్యంగా ఈ కాఫీహోటలుకు ఎందుకు వచ్చారూ ?

రేపటిదాకా ఉండిపొమ్మని తాను అనటంలోనూ, అతను అందుకు ఒప్పుకోవటంలోనూ గల అంతరార్థం ఏమిటీ ? అతను తన కూతుర్ని చేసుకోవటం గురించి పునరాలోచించుకోవటానికి ఒప్పుకున్నట్టా ? ఇంతా అయాక అతనికి పిల్లనివ్వటం తనకు సమ్మతం కాకపోతే అప్పుడు తానై మళ్ళీ ఈ సంబంధానికి స్వస్తి చెప్పాలా ?

అనుమయ్యకు చాలా కోపం వచ్చింది. తనకు అన్నీ ఇటువంటి దిక్కుమాలిన సమస్యలు ఎందుకు దాప రిస్తాయో ఆయనకు కొంచెంకూడా అర్థం కాలేదు.

ఈ సమస్య ఇలా ఉండగా ఆ పోయిన నూరురూపా యల నోటు సమస్య యింకొకటి ఉన్నది. దాన్ని ముకుం దుడే తీసి ఉంటాడు. వెధవ ! ఎందుకు తీశావని తాను అడుగుతాడు. నేను తియ్యలేదంటాడు ముకుందుడు. తాను దొంగతనం ఋజువు చెయ్యలేడు. ఈ లోపుగా తన యిల్లాలు కొడుకును వెనక వేసుకువచ్చి తనను అడ్డ గాడిదను చేసేస్తుంది.

"ఎవడో హత్యలుచేసే ముండాకొడుకు మాటలు నమ్మి కన్న కొడుక్కు దొంగతనం అంటగడతారా?

హావ్వ! ఇంత విస్తారం ఎక్కడా చూడలేదు" అంటుంది. దాంతో తాను అచ్చమైన అడ్డగాడిద అయిపోతాడు.

"ఏమోయ్, నీ నోటు పోయిందిగదా దాన్ని గురించి ఎవరిపైన దొంగతనం అంటగట్టాలో నాకు అర్థం కావటంలేదు. మా అమ్మాయి దొంగతనం చెయ్యలేదంటున్నావు. దొంగ నేనో, నా భార్యో, నా కొడుకో అయివుండాలిగదా! ఎవరు దొంగిలించినా నీకు ఆ డబ్బు నేనే అచ్చుకుంటా ననుకో! కాని విచారణ ఎలా చేస్తే బాగుంటుందని నీ ఉద్దేశం?" అన్నాడు అనుసుయ్యా కుశాల్రావుతో అకస్మాత్తుగా.

"ఏమీ చెయ్యకుండా ఊరుకోవటం ఉత్తమం. నాకు మీరా నూరు రూపాయలు ఇవ్వనుకూడా వద్దు. మీ ఇంట్లో నా స్థితి ఎలా వికటించిందో చెప్పటానికిగాను ఈ దొంగతనం బయటపెట్టవలసి వచ్చింది" అన్నాడు కుశాల్రావు.

"నువు మా సంబంధం చేసుకోకుండా ఉండటానికే నిశ్చయించావా?"

"మీరా మాట అనటం నాకు చాలా అన్యాయం. నేనే అవసరం లేదని మీ ఇంటో ఎవరో నిర్ణయించారు. అది నాకు తెలియగలందులకు నా డబ్బు తీశారు."

"అలా దేనికి అనుకోవాలి? మా ఇంటో ఎవరో ఒక దొంగబుద్ధిగల మనిషి ఉండవచ్చు. దురాశకొద్దీ డబ్బు కాజేసి ఉండవచ్చు."

"అలా అయితే మొత్తం పర్సుపోయి ఉండేది."

అనుమయ్య ఆలోచించాడు: "నిన్ను అవమానించటానికే ఎవరో ఈ దొంగతనం చేశారంటావు?" అన్నా డాయన.

"దానికేమీ సందేహం లేదు."

"ఈ అవమానాన్ని ఎటువంటి పరిస్థితుల్లో అయితే క్షమిస్తావు?"

"అయ్యయ్యో! చాలా ఘోరమైన మాట వాడారే. క్షమించట మేమిటండీ! నా డబ్బు తీసిన మనిషి నామీద ఉండే అనాదరంకొద్దీ డబ్బు తీసుకున్నానని ఒప్పుకుంటే చాలు. ఆ మనిషి తన అభిప్రాయం మార్చుకున్నట్టు ఒప్పుకుంటాను", అన్నాడు కుశాల్రావు.

"సరే!" అన్నాడు అనుమయ్య ఏదో నిశ్చయానికి వచ్చిన వాడిలాగా.

హోటలు బిల్లిచ్చి ఇద్దరూ బయటికి వచ్చినాక అనుమయ్య, "నీ ప్రోగ్రా మేమిటి? నేను హార్బరుకు వెళ్ళి పని చూసుకుని అయిదున్నరా, ఆరు మధ్య మా ఆఫీసు దగ్గిరికి చేరుకుంటాను, నువు అక్కడికివస్తే ఇద్దరమూ కలిసి సర్వేశ్వర్రావింటికి పోదాం!" అన్నాడు.

"మీ యిష్టం!" అన్నాడు కుశాల్రావు....

సర్వేశ్వర్రావు ఆ సాయంకాలం కుశాల్రావును చాలా ఆదరంతో చూశాడు. అనుమయ్యగారి కుటుంబ

మంతా అక్కడే భోంచేశారు. కుశాల్రావును రాత్రికి ఉండి పొమ్మన్నాడు సర్వేశ్వర్రావు.

ఇంటికి వస్తూనే అనుమయ్య ముకుందుడితో "అతని నూరు రూపాయల నోటు తీశావుట్రా?" అన్నాడు.

"అవును తీశాను. పిరికిపంద నీతో మొరపెట్టుకున్నాడేం? నన్ను అడక్కపోయాడూ ధైర్యం ఉంటే! ఇదిగో వాడి పాపిష్టి డబ్బు!" అంటూ ముకుందుడు నోటు జేబులోనుంచి తీసి తండ్రికి ఇచ్చాడు.

పంచాయితీ యింత త్వరలో ముగుస్తుందని అనుమయ్య వూహించలేదు.

"ఎందుకు చేశావీ వెధవపని?"

"వాడు వెధవ గనక! లేకపోతే మన యింటోవచ్చి తిష్ఠ వేయటం ఏం రోగం? వీణ్ణి మనం బొట్టూ, కాటుకా పెట్టి పిలిచామా?"

"పెళ్ళి నిశ్చయ మనుకున్నాం గనుక ఇంటికి వచ్చాడు. అంతకుమునుపు రోజుకు పాతిక చొప్పునపారేసి హోటల్లో ఉన్నవాడేగా?" అన్నాడు అనుమయ్య.

"ఆ హంతకుణ్ణి వెనకేసుకువచ్చి మాట్లాడకండి. వినేవాళ్ళకు ఎబ్బెట్టుగా ఉంటుంది! మీరు వాణ్ణి ఇంటో నుంచి సాగనంపటానికి తటపటాయిస్తారేమోనని ముకుందుడు ఈ పని చేశాడు. రేపు వాడి డబ్బు వాడి మొహాన పారేసి వేంచెయ్య మనండి," అన్నది కమలమ్మ.

"అతను మనకన్న తక్కువ తిన్నవాడు కాడు. ఇవాళ మధ్యాహ్నం పన్నెండింటికే మా ఆఫీసుకువచ్చి మన సంబంధం తనకు అక్కర్లేదని చెప్పాడు," అన్నాడు అనుమయ్య.

"ఏం వాడి పొగరూ? సంబంధం అక్కర్లేంది వాడికా, మనకా?" అన్నది కమలమ్మ పౌరుషంగా.

"ఆ మాట మనం అనేలోపుగా అతనే అనేశాడే!" అన్నాడు అనుమయ్య.

"మన పని తేలిక అయిపోయింది. వేంచెయ్య మనకపోయారా?"

"అనేవాణ్ణే, కాని అంతకుముందే సర్వేశ్వర్రావు నాకు టెలిఫోను చేశాడు—అతన్ని ఇవాళ తమ ఇంటికి తీసుకురమ్మన్నాడు. మనం సంబంధం మానుకున్నామని చెబితే యిష్టంలేకపోతే మానెయ్యమన్నాడు. ఈ పాటికి అతనికి తన రుక్మిణినిచ్చి చెయ్యటానికి కుశాల్రావు చుట్టూతా ఉచ్చులు పన్నతూంటాడు. మనం అతన్ని ఎట్లా వదలించుకుందామా అని చూస్తుంటే బతకనేర్చిన సర్వుడు అతన్ని ఎట్లా అల్లుడుచేసుకుందామా అని చూస్తు న్నాడు! అదీ మనకూ వాడికీ తేడా!" అన్నాడు అనుమయ్య.

కమలమ్మ నోరు తెరచి నోటికి చెయ్యి అడ్డం పెట్టుకుని అంకిళ్ళు నొక్కుకుని, "ఈయన కేమన్నా పిచ్చా ఏమండీ? నిజంగా రుక్మిణినిచ్చి చేద్దామనే?" అన్నది. ఆ ప్రశ్నలో ఆశ్చర్యంకన్న కూడా హెచ్చుగా మొక్క

పోయిన ఆత్మవిశ్వాసమూ, రాజీ ధోరణీ, పునరాలోచనా సక్తీ ధ్వనించినై.

"మనకు అన్నీ తెలుసుననుకొని అయోమయంలో పడుతున్నాం!" అన్నాడు అనుమయ్య.

"మీరన్నది నిజమే అయేట్లయితే మనం తొందర పడి ఈ సంబంధం పోనివ్వడం మంచిది కాదేమో?" అన్నది కమలమ్మ.

"నువ్వు పోనిచ్చేదేమిటి, అతను మన ఇంటో ఒక్క క్షణం ఉండననీ, మనమ్మాయికి మంచి సంబం ధంగా చూసి చెయ్యమనీ అంటుంటేనూ!" అన్నాడు అనుమయ్య.

"చిక్కే వచ్చిందే! మనం వెళ్ళవద్దంటే ఉండి పోడూ? మెతక మనిషిలాగే కనిపిస్తాడే!" అన్నది కమ లమ్మ కాస్తయినా లజ్జించకుండా.

"నేను అదీ అడిగి చూశాను. ఏ షరతుమీద అయితే నీ ఉద్దేశం మార్చుకుంటావు అన్నాను. తన డబ్బు కూడా తిరిగి ఇవ్వక్కర్లేదుట! అది తీసుకున్నవాడు-అంటే మన దౌర్భాగ్య దామోదరుడు—తనమీది ఉండే అనా దరంకొద్దీ డబ్బు తీసుకున్నట్టు ఒప్పుకుంటే చాలుట!"

ఇంతసేపూ లోలోపల రగులుతూ ఉండిన ముకుం దుడు ఒక్కసారి పైకి పొంగాడు.

ఆ మాట అనటానికి నాకు భయమనుకున్నాడా? వాడిమీద నాకు ఆవగింజంత ఆదరం కూడా లేదు. కావలిస్తే ఆ సంగతి పత్రికల్లో కూడా వేస్తాను. కాని ఆ మాట అంటే వాడు ఈ ఇంట్లోనే తిష్ఠ వేసే పక్షంలో నేను చచ్చినా ఒప్పుకోను. అసలు వాడి డబ్బు తీశానని కూడా ఒప్పుకోను—అనాదరం మాట దేవుడెరుగు!" అన్నాడు ముకుందుడు.

"ఒరే, నాకు తెలియక అడుగుతానూ, ఒకవేళ ఆ సర్వేశ్వరావు ఈ పిల్లవాడికి చల్లగా తన కూతుర్నిచ్చి చేస్తే!" అన్నది కమలమ్మ.

"ఇయ్యనియ్యవమ్మా! వీడు కాకపోతే చంద్రికి మొగుడే దొరకనట్టు మాట్లాడతావేమిటి? నువ్వూ నాన్నా ఈ బ్రాహ్మణి గురించి ఇంత రాద్ధాంతం ఎందుకు చేస్తున్నారో నా కర్థం కావటంలేదు," అన్నాడు ముకుందుడు.

అనుమయ్య దీర్ఘంగా ఒక్క నిట్టూర్పు విడిచాడు. ఇదంతా ఇలాగే పరిణమిస్తుందని ఆయనకు మొదటే తెలుసును.

# 4

ఆరోజు తనకు చాలా యిష్టమైనది జరగబోతుం దంటే మనుషులు చాలా ఉల్లాసమైన మనసుతో నిద్ర లేస్తారు. ముకుందుడు అట్లా నిద్రలేచాడు. ఎందుకంటే ఇవాళ తమ యింటికి కుశాల్రావు పీడ విరగడ అయిపో తుంది! బహుశా వాడికీ రుక్మిణికీ పెళ్ళి స్థిరమవుతుంది: సర్వేశ్వర్రావుకు ఆపాటి శాస్తి కావలసిందే—ఈ హంత కుడిలో చూపించిన శ్రద్ధలో పదోవంతు కూడా తనలో చూపించకపోవటమేం?

"సామాన్యంగా" ఉదయం ఎనిమిదికల్లా హోటల్లో ఉండటం ముకుందుడికి అలవాటు. కాని కుశాల్రావు వచ్చేటప్పటికి తాను ఇంట్లో ఉండాలనేఉద్దేశంతో కాఫీ హోటలుకు వెళ్ళి ఏడు కొట్టేలోపలే తిరిగివచ్చాడు. వాడు తన క్షమాపణ కోసం వస్తాడుకాదూ? రానీ! వాడు రావ టంకన్న వెళ్ళటం రసవత్తర ఘట్టం!

అయితే ఏ కారణంచేతనో కుశాల్రావు రాలేదు. తొమ్మిది దాటినా అతను రాకపోయేసరికి ముకుందుడు అమిత నిరుత్సాహపడ్డాడు. ఏం జరిగింది? కుశాల్రావు అప్పుడే తమ యింటిమీద సొడ్డు వేసేశాడా?

ఈ మాట అనుకుంటే ముకుందుడికి చాలా తృప్తి కలగాలి.—కాని కలగలేదు.

అప్పుడే రుక్మిణికీ వాడికీ పెళ్ళి స్థిరమై పోయిందా కొంపతీసి!

ముకుందుడు అసూయతో దహించుకు పోయాడు. ఒకప్పుడు రుక్మిణిని తనకిస్తే బాగుంటుందని ఆడవాళ్ళు అనుకునేవారు. ఆ రోజుల్లో రుక్మిణి అంత బాగుండేదికాదు. అది బాగుండటం మొదలుపెట్టినాక తను కిద్దరికీ పెళ్ళి చెయ్యాలన్న సంగతి ఎత్తినవాళ్ళు లేరు. కిందటేడు తాను కొంచెం తొందరపడి రుక్మిణిమీద తనలో పొంగివచ్చే భావావేశాన్ని అనాగరికంగా బయటపెట్టుకున్నాడు. అది మొదలు రుక్మిణి తనతో మాట్లాడదు. తనకేసి చూస్తే మొహం చిట్లిస్తుంది.

రుక్మిణి వెళ్ళి ఏ గంగలోనైనా దూకనీ! కుశాగ్రావుగాణ్ణి పెళ్ళాడితే వేరే ఏ గంగలోనో దూకనవసరం లేదు!

పెందలాడి హోటలుకు వెళ్ళి రావటంచేతనో ఏమో ముకుందుడికి పదిగంటలవేళ ఆకలి అనిపించింది. వీధి మలుపులో వున్న హోటలుకు వెళ్ళాడు. అక్కడ తలవని తలంపుగా జర్నలిస్టు శర్మ కనిపించాడు.

జర్నలిస్టు అన్న తరవాత రకరకాల వాళ్ళతో పరిచయం ఉంటుంది. వాళ్ళు ఏ రకంమనిషి నుంచి రావలసిన ప్రయోజనాలను ఆ రకంవాళ్ళనుంచి రాబట్టుతూంటారు.

"ఏమోయ్! మీ నాన్నగారిని ఒకసారి చూడాలే!" అన్నాడు శర్మ.

"తప్పక చూడండి. దేనికి?" అన్నాడు ముకుందుడు.

"మరేంలేదు, మా అత్తవారివేపు బంధువు లొస్తు న్నారు. హార్బరు చూపింతామనీ!" అన్నాడు శర్మ.

"దానికేం భాగ్యం?"

"అన్నట్టు ఇవాళ రేసులు మొదలు కాదూ! పాసు న్నది. నే నేలాగూ వెళ్ళటం పడదు. నీకు గుర్రాలమీద డబ్బు వేయటం అలవాటున్నదా?"

"లేదు."

"లేకపోతే లెక్కలేదు. పోనీ రేసులు ఎన్నడన్నా చూశావా?"

"అదీ లేదు."

"అయితే ఇది పట్టుకెళ్ళి కాస్సేపు చూసిరా. ఫస్టు ఎంక్లోజరుపాసు. నేను చాలాసార్లుచూశాను. జనం వెర్రెత్తి కేకలు పెడుతుంటే సరదాగానే ఉంటుంది. ఎప్పుడు గుర్రాలు తొస్తే అప్పుడే చక్కా రావచ్చు?" అన్నాడు శర్మ ముకుందుడికి పాస్ ఇస్తూ.

అతనిచ్చాడుగదా అని ముకుందుడు దాన్ని తీసు కుంటూ "థాంక్స్!" అన్నాడు.

అప్పట్లో ముకుందుడు దాన్ని ఉపయోగింతా మనుకోలేదు. కాని అన్నాలదగ్గిర తల్లి తండ్రీ మతులు పోయినవాళ్ళలాగా ఆ కుశాల్రావు గురించి ఊహాగానాలు చేస్తూంటే వాడికి ఇంటినుంచి బయటపడాలనిపించింది. బయట పడ్డాక రేసులు జ్ఞాపకం వచ్చాయి. ముకుందుడు

అనుమానిస్తూ రైలుస్టేషను చేరాడు. కాని గిండీ రైళ్ళలో సమ్మర్దం చూశాక, తాను ఈ ఛాన్సు పోగొట్టుకుంటే చాలా పొరబాటే అయి ఉండేదనిపించింది. జనాన్ని అలా వేల సంఖ్యలో ఆకర్షించేది ఏదైనా తెలుసుకోవలసినదే అని వాడి నమ్మకం.

గిండీ స్టేషన్ దిగి ఇటు వెళ్ళాలో, అటువెళ్ళాలో కూడా ముకుందుడికి తెలీదు. కాని ఎక్కువమంది ఎటు పోతుంటే తానూ అటే వెళ్ళాడు. ముఖ్యంగా రేస్ పుస్తకాలు చేతుల్లో ఉన్నవాళ్ళను వాడు నమ్ముకుని వారివెంట వెళ్ళాడు. వారి సంభాషణ మాత్రం వాడికి మరోభాష లాగా వున్నది.

రేస్‌కోర్సులోకి వెళ్ళాక వాడి అయోమయం మరింత హెచ్చింది గాని తగ్గలేదు. ఎక్కడ చూసినా జనం ఉన్నారు. కొందరు ఒక పనిమీద ఉంటే మరి కొందరు ఇంకొక పనిమీద ఉన్నట్టు కనబడ్డారు. కాని ఎక్కడా గుర్రాల జాడ లేదు. జనం దేనికోసం హడావుడి పడుతున్నదీ వాడికి అర్థంకాలేదు. అయోమయంగా అటూ యిటూ కొంతసేపు తిరిగాక జనం కూచునే చోటు వాడి కంట పడింది. తనుకూడా వెళ్ళి అట్టే ఎత్తుగానిచోట కూచున్నాడు. చుట్టూ కలయజూస్తే ఎవరూ ఎరిగినవాళ్ళు కనిపించక పోయేసరికి' జేబులోంచి సిగరెట్టు పెట్టె, అగ్గిపెట్టె తీసి ఒక సిగరెట్టు అంటించాడు.

ఎదురుగా అలవ ఉన్నది. దాని అవతల ఏదో స్టాండుపైన అంకెలూ, పేర్లూ అమర్చారు. కొంచెం

సేపటికల్లా జనంలో కలకలం బయలుదేరింది. ముకుందుడు జనంకేసి చూశాడు తప్ప మొదటి రేసులో పాల్గొనటానికి వెళుతున్న జాకీలనూ, గుర్రాలనూ చూడలేదు.

జనాన్ని చూడటంలో వాడికి కుశాల్రావు కంట పడ్డాడు. గోధుమరంగు వులెన్ సూటూ, ఈవెనింగ్ టోపీ, ఎర్రని టై ధరించి, గాగల్స్ పెట్టుకున్న కుశాల్రావును వెంటనే ముకుందుడు గుర్తించలేదు. గుర్తించినాకకూడా ఆ మనిషిని మొదటిసారి చూస్తున్నట్టు భావించాడు.

"మొత్తానికి వీడికి ఉండవలసిన అవలక్షణాలన్నీ ఉన్నాయ్! వీడు నాలాగా చూడటానికి వచ్చి ఉండడు. గుర్రాలమీద పెట్టటానికి వీడికి డబ్బెక్కడున్నదో! జేబులు కత్తిరిస్తాడు కూడా నేమో!" అనుకున్నాడు ముకుందుడు.

వాడు మొదటి రేసు గుర్రాలు పరుగెత్త నారంభించటం చూడలేదు. కాని జనం ఒక్కసారిగా గొల్లున అరవటమూ, ఆ తరువాత గుర్రాలు పరిగెత్తి వచ్చే చప్పుడూ, తన చుట్టూ ఉన్నవాళ్ళు కొందరు లేచి నిలబడటమూ, కొందరి చేతులలో బైనాక్యులర్స్ ఉండటమూ వాడికి కలలాగా అస్పష్టంగా తెలియవచ్చింది.

కొద్ది క్షణాల్లో కల్లోలమంతా సమసిపోయింది. స్టాండుపైకి ఏవో అంకెలు వచ్చినయ్.

ముకుందుడికి అదంతా పట్టలేదు. వాడి కళ్ళు కుశాల్రావుకోసం వెతుకుతున్నయ్. కుశాల్రావు ఎక్కడా

లేదు. అతడు ఎటు వెళ్ళాడో, ఏం చేస్తున్నాడో తెలుసు కోకపోతే తన జన్మ నిరర్థక మనిపించినంత పని అయింది ముకుందుడికి. కాని వాడు మళ్ళీ కుశాల్రావును చూడ టానికి పది నిముషాలు పట్టింది. ఈసారి కుశాల్రావు అలవ దగ్గరగా వెళ్ళి నిలబడ్డాడు.

ఒక్కొక్క రేసే అయిపోతున్నది. అవే గుర్రాలు సర్కసు బఫూనుల్లాగా దుస్తులు ధరించి వాళ్ళే జాకీలు మళ్ళీ మళ్ళీ పరుగెత్తుతున్నట్టు ముకుందుడు ఊహించు కున్నాడు. కుశాల్రావు అప్పుడప్పుడూ కనిపిస్తూ మాయ మవుతున్నాడు.

ముకుందుడికి విసుగెత్తి ఆవలింతలు వచ్చినై. వాడు తాను కూచున్న చోటునుంచి లేచి దిగి వచ్చాడు. అంతకు ముందే అయిదో రేసు అయిపోయింది. ముకుందుడికి ఉద్దేశం ఇంటికి పోదామని. వాడు కొంత దూరం వచ్చేసరికి కుశాల్రావు ఎదురుగా వస్తూ కనిపించాడు.

అయితే కుశాల్రావు వందరూపాయిల నోట్లు-కనీసం రెండు మూడైనా ఉంటై—పర్సులో పెట్టుకుంటూ ఉండ టంచేత ముకుందుణ్ణి చూడలేదు. ముకుందుడు కొంచెం అవతలికి తొలిగి కుశాల్రావును తప్పుకుని ముందుకు సాగాడు.

"వీడు రేసుల్లో డబ్బుకూడా గెలుస్తున్నాడన్న మాట!". అందులో కూడా ఏదో దుర్మార్గం ఉండివుండా లని ముకుందుడికి అనిపించింది. చాతనయితే రేసుల్లో డబ్బు

చేసుకొనే హక్కు ప్రతి పౌరుడికీ ఉన్నదనీ, ఆ డబ్బు మీద ప్రభుత్వం ఆదాయపు పన్ను కూడా విధించదనీ నా దెసగడు.

ముకుందుడు ఇంటికి వచ్చేసరికి ఆరు గంటలయింది.

కమలమ్మ వంట ప్రయత్నం చెయ్యబోతున్నది. చంద్రావతి పెళ్ళికూతురులాగ ముస్తాబయింది. అనుమయ్య ఇంట్లో లేడు—బహుశా సర్వేశ్వర్రావింటికి వెళ్ళి వుంటా డనుకున్నాడు ముకుందుడు.

"అమ్మా, అమ్మా! ఆ దరిద్రుడు గుర్రప్పందాలకు పోతాడే!" అన్నాడు ముకుందుడు వంటింట్లో వున్న తల్లితో.

"సప్త వ్యసనాలూ ఉన్నై అన్నమాట!" అన్నది తల్లి, కొడుకు కుశాల్రావు గురించి మాట్లాడుతున్నాడని సరిగా వూహించి.

"డబ్బు సంపాదిస్తున్నట్టున్నాడమ్మా!"

"వెర్రివాడా, జూదంలో వచ్చే డబ్బును నమ్మటానికి ఉన్నదా? జూదంలో బాగుపడ్డవాడు లేడు. నలుడు చూడరాదూ, పాండవులు చూడరాదూ?" అన్నది కమలమ్మ.

జూదంలో గెలిచిన పుష్కరుణ్ణి, దుర్యోధనుణ్ణి చూసి ఆవిడ నీతి ఏమీ నేర్చుకోదలచ లేదు.

"వాడు తన పెట్టె ఇంకా తీసుకుపోలేదుగా?" అన్నాడు ముకుందుడు.

"లేదు, ఆ పెట్టె ఆ గదిలోనే ఉంది."

"చూస్తుండు! వీడు ఒకంతట వదలడు!"

మరొక అరగంటకు అనుమయ్య తిరిగి వచ్చి "హమ్మయ్య!" అంటూ పేముకుర్చీలో కూలబడ్డాడు.

"ఎక్కడికి తిరిగొచ్చారేమిటి? మీ సర్వేశ్వర్రావు గాని కనిపించలేదుగా?" అన్నది కమలమ్మ వంటచేసే చేత్తో గరిట పట్టుకుని వచ్చి.

అనుమయ్య తనలో తాను మాట్లాడుకుంటున్నట్టుగా, "చేసుకోననేశాట్ట!" అన్నాడు,

"ఎవరు? ఏమిటి? సరిగా చెప్పండి, నాన్చిచంపక," అన్నది కమలమ్మ.

"చెబుతుంటినిగా! సర్వుడు తన కూతుర్నిస్తానన్నాట్ట, అతను చేసుకోనన్నాట్ట!" అన్నాడు అనుమయ్య.

"ఏది? కుశాల్రావేనా?"

"కాకపోతే వల్లకాట్లో రామురు దాయను గురించి మాట్లాడుతున్నాననుకున్నావా?" అన్నాడు అనుమయ్య భార్యనుచూస్తూనే కలిగే చిరాకుతో.

"చేసుకోనన్నాడూ? రోగం కంగున కుదిర్చాడు. అక్కడే భోంచేశాడా ఏమిటి?"

"ఆ తరవాత రేసు కోర్సుకు పోయి వందలు వందలు సంపాదించుకున్నాడు!" అన్నాడు ముకుందుడు దాగని అసూయతో. ఇస్తే తాను చేసుకోటానికి సిద్ధంగా ఉన్న రుక్మిణిని కుశాల్రావు వద్దనటం ముకుందుడు అర్థం చేసుకోలేదు.

ఆ మాటకు, వస్తే అనుమయ్యకూ కమలమ్మకూ కూడా కుశాల్రావు ప్రవర్తన అయోమయంగానే ఉన్నది. అందుకని అనుమయ్య ఆందోళన పడ్డాడు, కమలమ్మ నిశ్చింతగా ఉన్నది అంతే తేడా.

ఎవరి ఆలోచనలో వాళ్ళున్న సమయంలో బయట కారు ఆగినచప్పుడయింది. కుశాల్రావు లోపలికి వచ్చాడు.

"ఏమోయ్, పొద్దుటినించీ కనిపించనే లేదూ?" అన్నాడు అనుమయ్య.

"సొంతపనులమీద తిరుగుతున్నాను," అన్నాడు కుశాల్రావు.

"కూచో," అన్నాడు అనుమయ్య.

"లేదు పోవాలి, బయట టాక్సీ ఉన్నది. నా పెట్టె తీసుకుపోటానికి వచ్చాను."

"రేపొద్దున పోగూడదూ?"

"ఎందుకులెండి? హోటల్లో రూము తీసుకున్నాను."

"ఏ హోటల్లో? కొత్త వుడ్ లాండ్సులోనా?"

"అవును, పన్నెండో నెంబరు గది."

"నీకు రేసులకు పొయ్యే అలవాటున్నదా ఏమిటి? రేపుపొద్దున హోటలుకు పోదువుగానిలే. టాక్సీ పంపించెయ్యి!" అన్నాడు అనుమయ్య.

సర్వేశ్వర్రావు మాట విననివాడు తనమాట వింటాడని ఋజువుచెయ్యటం అనుమయ్యకు అత్యవసరమనిపించింది.

కుశాల్రావు కొంచెం ఆలోచించి బయటికి వెళ్ళి మళ్ళీ వచ్చి కూచున్నాడు.

"నీవు రేసుల్లో వందలు వందలు గెలిచావుటగా ?" అన్నాడు అనుమయ్య.

"నేను డబ్బు సంపాదించటానికి రేసులకు పోతాను గాని సరదాకు కాదు. నాకు గుర్రాలమీదా, జాకీలమీదా అపేక్ష లేదు. నాకది వృత్తి. అందులో నష్టంవస్తే వ్యాపారంలో నష్టంలాగే మళ్ళీ పూడ్చుకుంటాను," అన్నాడు కుశాల్రావు.

"అటువంటిది సాధ్యమా ?" అన్నాడు అనుమయ్య ఆశ్చర్యంతో.

"ఎందుకు కాదూ ?"

"రేసుల్లో ఎలా గెలుస్తావో నాక్కూడా కాస్త చెబుదూ !"

"అందరికన్నా ఎక్కువసార్లు గెలిచే జాకీని ఏరుకుని, వాడు ఎక్కే గుర్రంమీదనల్లా డబ్బు కాస్తాను. ఒక గుర్రం రాకపోతే రెండోగుర్రంమీద రెట్టింపో, మూడింతలో కాస్తాను. రెండోసారి కాకపోతే మూడోసారి, మూడోసారి కాకపోతే నాలుగోసారి నా జాకీ గెలిచి తీరుతాడు. నా దగ్గిర పెట్టుబడి ధనం వుండాలి, అంతే. నా బిజినెస్‌లో ఎన్నడూ నష్టం రాదు. నా డబ్బు నాకు వచ్చి పైన అంతో ఇంతో మిగులుతుంది.

"మరి రేసుల్లో నష్టపోయేవాళ్ళ మాటేమిటి ?"

"కొందరు కొన్ని గుర్రాలను ప్రేమించి వాటిమీద డబ్బు కాస్తారు. అవి గెలిస్తే లాభం పుచ్చుకుంటారు, లేకపోతే నష్టపడతారు. కొందరు ఆశాపాశకులు ఫ్లూక్ గుర్రాలమీద కాస్తారు. వస్తే పెట్టుబడికి పదింతలు వస్తుంది. కాని నూటికి తొంభైతొమ్మిదిసార్లు నష్టపోతారు. మిగిలిన వాళ్ళు చాలావరకు టిప్పులు నమ్ముకొని గుడ్డిగా కాస్తారు. వాళ్ళూ గోతిలోనే పడతారు. నేను అతి ఆశకు పోను. పెట్టుబడిలేసి వ్యాపారం చెయ్యను. పరిమితమైన లాభంతో బయటపడతాను. చట్టవిరుద్ధంకాని వ్యాపారం!"

అనుమయ్య నిట్టూర్చాడు. "ఏమంటాడు మా సర్వేశ్వరుడు ?

"వాళ్ళ అమ్మాయిని చేసుకోమన్నారు. ప్రస్తుతానికి పెళ్ళి ఆలోచన మానుకున్నానని చెప్పాను. రేపు 'హిందూ'లో పెళ్ళి ప్రకటన వేద్దామనుకుంటున్నాను," అన్నాడు కుశాల్రావు.

"ఎందుకోయ్ ? మా చంద్రిని చేసుకో !" అనటానికి తాను ఎంత అసమర్థుడైపోయాడో అనుమయ్యకు తెలిసివచ్చింది. ఈ కుశాల్రావు రుక్మిణిని చేసుకోవటం గురించి తన భార్యా, సుపుత్రుడూ తమ అంతరాత్మల్లో ఏమనుకుంటున్నారో తెలుసుకోవాలని ఆయనకు అనిపించింది. కాని బహుశా ఏమీ అనుకుంటూ ఉండరని తేల్చుకున్నాడు. రాళ్ళూ, రప్పలూ తమ పరిసర పరిస్థితు

లను గురించి ఏమన్నా అనుకుంటారా? వీళ్ళా అంతే!.... అదీ నిజంకాదు. కొన్ని విషయాలను గురించి వీళ్ళు చాలా జాస్తీగా-అవసరమైనవానికన్న ఎక్కువగా అనుకుంటారు.

ఇంతకూ తన భార్యమనసూ, కొడుకుమనసూ ఏ విధంగా పనిచేసేదీ అనుమయ్యకు తెలీదు. తెలియకపోతే పోయిందిలే అని ఊరుకోలేక గిజగిజా కొట్టుకునేవాడు.

"ఈసారి సంబంధం చూసేటప్పుడు నేరుగా వధువుతోనే ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతాను. నా బంధు ప్రీతిని కొంతవరకు చంపుకుంటేనేగాని బాగుపడను," అన్నాడు కుశాల్రావు.

"పెద్దవాళ్ళ సలహా లేకుండా ఏ పిల్లమాత్రం ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతుంది?" అన్నాడు అనుమయ్య.

"ఏమో ఎవరు చూశారు? కొంద రాడపిల్లలు తమ యోగక్షేమాలు చూసే శక్తి పెద్దవాళ్ళకు లేదనిపిస్తే, స్వతంత్రించి తామే తమ భర్తలను నిర్ణయించుకోవచ్చు. పద్దెనిమిది వెళ్ళిన ప్రతి ఆడపిల్లకూ అలాటి హక్కున్నది!" అన్నాడు కుశాల్రావు.

"నువు సర్వేశ్వర్రావు కూతుర్ని చేసుకోననటానికి ప్రత్యేకమైన కారణం ఏమన్నా ఉందా? తెలుసుకుందామని అడుగుతున్నాను, వేరేగా అనుకోకు."

"ఏమిటో స్పష్టంగా చెప్పలేను. ఆ సర్వేశ్వర్రావు గారు ఒకటి ఆలోచించి ఒకటి మాట్లాడేటట్టు కనిపిస్తారు.

అసలు వాళ్ళింట్లో అందరూ వేటగాళ్ళలాగా కనపడ్డారు నా కంటికి. వారి వేటకు లేడిగా వుండటం నా కిష్టంలేదు. నా దురదృష్టం, నేను బుద్ధెరిగినప్పటినుంచీ దుర్మార్గుల తోనే తిరిగాను. స్వతహాగా దుర్మార్గుణ్ణి కాకపోవటం చేతనో ఏమో నాకు అమాయకులతోనూ, మంచివాళ్ళ తోనూ తిరగాలనిపిస్తుంది. ప్రపంచంలో కపటంలేని మనస్సును మించినది నాకేమీ కనపడటంలేదు.

కమలమ్మ కుశాల్రావు అనే మాటలకు సంబంధం లేకుండా మాట్లాడేదానిలాగా, "ఎంత నాగరికత బలిస్తే మాత్రం ఆడపిల్లలు తమ తల్లిదండ్రుల అనుమతి లేకుండా పెళ్ళి విషయమై ఉత్తరాలు రాస్తారా ఏమిటి ?" అన్నది.

"ఆడవాళ్ళు సామాన్యంగా సాహసించరు గాని, సాహసించితే దేనికైనా సిద్ధపడతారు. నే నెరుగుదును— మా వూళ్ళో ఒక పిల్లను ఎంతకూ అత్తవారుతీసుకుపోలేదు. చూసిచూసి ఆ పిల్ల తమ ఇంట్లో పనిచేసే కమతగాణ్ణి తగులుకున్నది!" అన్నాడు కుశాల్రావు.

కమలమ్మకు ఒక్కసారి గుండెసి కొట్టినట్టయింది. ఆవిడ మొహం పాలిపోయింది. ఎందుకంటే ఆవిడ చిన్నతనంలో ఆవిడ పినతల్లి సరిగా అటువంటి పనే చేసినట్టు చెప్పుకున్నారు.

కమలమ్మ కుశాల్రావు కేసి భూతవైద్యుణ్ణి చూసినట్టు చూసింది. అదివరకల్లా ఆవిడకు కుశాల్రావును

చూస్తే తృణీకారభావమే ఉండేది. ఇప్పుడు బెదురుకూడా పట్టుకున్నది.

అనుమయ్య ఎవరో తన్నినట్లు లేచి, "అన్నట్లు నీ నూరురూపాయల నోటు దొరికింది. బీరువాలోనే ఉన్నది!" అంటూ లోపలికి వెళ్ళి నోటు తెచ్చి ఇచ్చాడు.

"అది పోదని నాకు తెలుసు. ఇదేమన్నా దొంగల గూడెమా?" అన్నాడు కుశాల్రావు. అతను తన నోటు తీసుకుని పర్సులో పెట్టుకున్నాడు. పర్సు చాలా లావుగా వున్నది.

కమలమ్మ వంటింట్లోకి వెళ్ళిపోయింది. ముకుందుడికి కుశాల్రావును ఏడిపించాలన్న ఉద్దేశం ఇప్పుడేమీ లేదు. వాడికికూడా తల్లిలాగే అతనంటే ఏదో భయం పట్టుకున్నది. వాడు లేచి బయటికి వెళ్ళాడు.

"నేను కూడా అలా బయటికి వెళ్ళి మళ్ళీ ఒక అర గంటలో తిరిగి వస్తాను!" అంటూ కుశాల్రావు లేచాడు.

"అంతకంటె ఆలస్యం చెయ్యకు. ఇంకో అర గంటలో భోజనాలు చేద్దాం!" అన్నాడు అనుమయ్య.

అతను వెళ్ళిపోగానే అనుమయ్యా, చంద్రావతీకూడా వంటింట్లో చేరారు.

"ఈ మనిషి నీ కేమైనా అర్థమైనాడా?" అని అనుమయ్య భార్య నడిగాడు.

"ఏముంది అర్థం కావడానికి? మనకు పనికి రాడూ, మనతో కలవడూ, మనకు వద్దు కూడానూ!" అన్నది కమలమ్మ బింకంగా.

"అతనిలో నీకు కనిపించిన లోపేమిటి?"

"రామాయణమంతా విని .. వాడు హత్యలు చేశాటగా?"

"ఎప్పుడో చిన్నప్పుడు తెలీక, అజ్ఞానంలో ఏంచేశాడో! అటువంటి పనులు చేసినవాళ్ళు పెద్దయి గొప్ప హోదాల్లో కూడా ఉన్నారు, తెలుసా?"

"మీ సర్వేశ్వర్రావు చెప్పిన మాటలేగా?" అన్నది కమలమ్మ.

ఎవరుచెప్పారో అనుమయ్యకు జ్ఞాపకం లేదు. నిజానికి తన భార్య ఇటువంటివన్నీ జ్ఞాపకం పెట్టుకుని తాను చెప్పే విషయాలను పెడమార్గం పట్టించినప్పుడల్లా ఆయనకు చిరాకెత్తుతుంది.

"వల్లకాట్లో రామరుద్రాయి ఎవడో చెప్పాడు! ఎవడు చెప్పాడన్నదా, చెప్పింది నిజమా అబద్ధమా అన్నదా మనకు కావలసింది?"

"మీ సర్వేశ్వర్రావుగారు ఈ సంబంధం మనకు కాకుండా తన కూతురికి చేసుకుండా మనుకున్నమాట అప్పుడే మరిచిపోయారుకూడా? అటువంటివాడి మాటలు

తన భార్య అయోమయానికి అనుమయ్య మండి పడ్డాడు.

"వాడప్పుడు మన సంబంధం చెడగొట్ట దలిచి చెప్పినట్లయితే ఆ మాట ఎందుకు చెబుతాడూ? అయ్యో మీ పిల్లను హంతకుడికెందుకిస్తారు అని అనేవాడు! అయిందా? మనం చేసుకోమన్నాకనే వాడు ప్రయత్నించాడు. అసలు ఇదంతా దేనికి? ఈ కుశాగ్రావు హంతకుడంటున్నావే, సర్వ్యాడు తన కూతుర్ని ఇతనికి ఎందుకిద్దామనుకున్నాడూ? నీపాటి తెలివితేటలు లేకనా? పరువు మర్యాదలు లేకనా? చదవేస్తే ఉన్నమతి పోయిందట — అలా ఉంది రానురాను నీవైఖరి!"

తనభార్యతో తాను ఇలాంటి వాగ్వాదాలకు దిగకూడదని అంతరాత్మ ఒకవంక గొణుగుతూనేఉన్నది. కాని అనుమయ్య ఆ గొణుగుడు వినిపించుకోలేదు. ఈ తర్కవితర్కాలద్వారా ఈ భార్యాభర్తలమధ్య లేని సామరస్యం ఏర్పడటమనేది ఇన్నేళ్ళలోనూ మచ్చుకు ఒకసారైనా జరిగి వుండలేదు.

"అయితే, ఇంతకూ ఏమంటారండీ? మన పిల్లను అతనికిచ్చి దానిగొంతు కోస్తానంటారా? అసలు మీ ఉద్దేశ మేమిటో బయట పెట్టరాదూ? ఈ వూకదంపుడంతా దేనికి?" అన్నది కమలమ్మ ఆవేశంతో.

"ఏదైనా తేల్చుకున్నవాణ్ణయితే ముందే చెప్పేవాణ్ణిగా! తేల్చటానికి నువ్వేమైనా సహాయ పడతావేమో

వనేగా నీతో ఇంతసేపు చర్చించటం ?" అన్నాడు అను మయ్య చాలా ఓర్పుగా.

"నేను తేల్చుకునేదేవో అదివరకే తేల్చుకున్నాను! నా బొందెలో వూపిరి ఉండగా ఈ సంబంధానికి ఒప్పు కోను. ప్రపంచమంతా గొడ్డుపోయినట్టు ఈ గత్తరేమి టంటా !" అన్నది కమలమ్మ.

అనుమయ్య కాస్సేపు ఆలోచించి, "అసలు కుశా ల్రావు మనవాడితో బోర్‌స్టల్ స్కూల్ మాట ఎత్తక పోతే మనకీ సంగతి మరొక విధంగా తెలియటానికి కనీసం పదిహేనేళ్లు పట్టేది. అతను మనవాడితో ఇది ఎందుకు చెప్పాడో ?" అన్నాడు స్వగతం మాట్లాడుకుంటున్నట్టుగా.

"ఎందుకా? మనం విని హర్షించి పిల్లనిస్తామని!" అన్నది కమలమ్మ, దొరికిన ఛాన్సు పోనివ్వకుండా.

"అదేం కాదులే ! మనమేదో సంస్కారం గల వాళ్ళ మనుకుని చెప్పాడు. మనం ఆ సంగతి విని విరు చుకు పడిపోయి, నోట నురుగులు కక్కుతామని అతనికేం తెలుసూ ?"

"వాడి సంస్కారం అడుక్కుతిన్నట్టే ఉంది. హంత కులను మంచిగా లెక్కించటమా సంస్కారమంటే ?" అన్నది కమలమ్మ.

"అయినా ఎందుకొచ్చిన ఘోష! నా మాట తీసెయ్యలేక ఈ పూటకు ఉన్నాడు. రేపు అతని దారిని అతను పోతాడు," అన్నాడు అనుమయ్య.

"నేను కాదన్నానా, వద్దన్నానా? ఈ పూటే వెళ్ళిపోతే ఇంకా సంతోషించేదాన్ని. దారేపోయే శనానెత్తిన ఎక్కి అన్నట్టు వాణ్ణి వుంచేశారు," అన్నది కమలమ్మ ...

ముకుందుడు ఇల్లుదాటి కొంతదూరం వెళ్ళినాక ఆగి సిగరెట్టు వెలిగించుకున్నాడు. ఇంతలో అతని భుజం మీద చెయ్యి పడింది. అతను వెనక్కితిరిగి కుశాల్రావును చూసి మరింత ఉలిక్కిపడ్డాడు.

"ఎక్కడిదాకా?" అన్నాడు కుశాల్రావు.

"నీ కెందుకు?" అందామనుకున్నాడు ముకుందుడు, కాని ధైర్యం చాలలేదు. "ఎక్కడికీలేదు, ఇక్కడికే!" అంటూ ఏదో గొణిగాడు.

"వేసిందే ఒక గంతూ, దిగిందే ఒక బుడ్డా అన్నట్టయినట్టుందే నీ సంగతి?" అన్నాడు కుశాల్రావు.

"అంటే?" అన్నాడు ముకుందుడు.

"నూరు రూపాయలనోటు సంగతే! నీకు నిజంగా కావాలా? కావలిస్తే తీసుకో! నే నెవరితోనూ చెప్పనులే! కిందటి సారయినా మీ చెల్లెలు చూడకపోతే ఎవరకీ తెలిసేది కాదు, మీ నాన్న నీచేత దాన్ని కక్కించిట్టుంది."

ముకుందుడు పిరికివాడు కాడు. కాని ఈ మాటలు వింటుంటే అతనికేదో దడ పుట్టుకొస్తున్నట్టయింది.

"నాచేత ఎవరూ కక్కించలేదు. ఎవరు తీశారని నాన్న అడిగితే నేనేనని చెప్పాను. నాకా డబ్బు కావాలిసి

తీసుకోలేదు,'' అన్నాడు ముకుందుడు తన గొంతులో వణుకు రాకుండా వుండటానికి విశ్వప్రయత్నం చేస్తూ.

"అలా చెప్పు ! కళకోసమే కళ అన్నట్టుగా, దొంగ తనం కోసమే దొంగతనం చేశావా ? దాన్ని క్లెప్టో మానియా అంటారు గాదూ ? ఎవరన్నా మంచి సైకో ఎనలిస్టు దగ్గరికి వెళ్ళి రాకూడదూ!''

ముకుందుడు రౌడీలను గురించి విని వున్నాడు. వాళ్లు ఇట్లా నవ్వుతూ మాట్లాడుతూనే గుండెల్లో బాకులు దిగేస్తారు. ముకుందుడు రోడ్డుమీది జనసంచారం చూసి కొంచెం ధైర్యం తెచ్చుకుంటున్న సమయంలో వాడి కింకొక భయంకరమైన అనుమానం తగిలింది.

కుశాల్రావు వెర్రివాడేమో !

కొందరి వెర్రి ఒకంతట బయటపడదు వాళ్ళు చాలా తెలివిగా కూడా మాట్లాడుతారు. ఎవడి గుండె లోనో బాకు దిగేసినదాకా జనానికి వాడు వెర్రివాడన్న అనుమానంకూడా రాదు. కుశాల్రావు అందరిలాగా ప్రవ ర్తించక పోవటానికి కారణం వాడి వెర్రేనేమో ! వెర్రి ముండాకొడుకు కాకపోతే చంద్రినిచూసి ఎందుకు పెళ్ళాడ తానంటాడు? రుక్మిణిని చూసి ఎందుకు వద్దంటాడు? చిన్న తనంలో తాను హత్య చేసిన సంగతి తనకు తానే ఎందుకు బయట పెట్టుకుంటాడు ? నిజంగా వెర్రివాడే—సందేహం లేదు. వెర్రి ముండాకొడుకు వెంట పట్టపగలు నడవటమే ప్రమాదకరం! చీకట్లో చెప్పేదేమిటి ? జనం తిరుగుతూనే

ఉన్నారనుకో. తన గుండెలో వాడు బాకు దిగేసినాక వాణ్ణి పట్టుకోవడానికి వాళ్ళు పనికివస్తారు గాని దౌర్జన్యం జరగకుండా ఆపగలరా?

ముకుందుడు కుశాల్రావుకు కొంచెం ఎడంగా జరిగి నడవసాగాడు.

"ఎందుకోయ్ నన్నుచూసి అలా బెదుస్తావ్? నీకు డబ్బు నిజంగా అవసరంలేదా? మొహమాటపడకు!" అన్నాడు కుశాల్రావు.

ఒక్క క్షణంపాటు చెయ్యి చాద్దామని ముకుందుడికి ప్రబలమైన కోరిక కలిగింది. పందరూపాయలు! ఉట్టుడియంగా! కాని ముకుందుడు ఆ కోరికను బలవంతాన అణచుకొని తల అడ్డంగా తిప్పాడు.

ఇదీ పిచ్చి లక్షణమే అయివుండాలి! పిచ్చివాడు కాకపోతే తనకు డబ్బెందు కిస్తానంటాడూ? అటువంటి మాట బుద్ధిగల వాళ్ళెవరూ తనతో అని వుండ లేదు.

"కాఫీ తాగుదామా?" అన్నాడు కుశాల్రావు హోటలు ఎదురుగా ఆగి. ముకుందుడు అనుమానించటం చూసి అతడు చెయ్యి పట్టుకొని లోపలికి లాక్కుపోయాడు.

రెండు కప్పుల కాఫీ ఆర్డరిచ్చాక కుశాల్రావు, "చదువు పూర్తి అయ్యాక ఏంచేద్దామనుకుంటున్నావు?" అన్నాడు.

"అందరూ ఏం చేస్తారో, నేనూ అదే చేస్తాను—నౌకరికి తే ఉద్యోగం," అన్నాడు ముకుందుడు జవాబు చెప్పటం ఆట్టే ఇష్టంలేనట్టు.

"నాకు ఉద్యోగమంటే చాలా భయం. ఇంకొకరు నన్ను తమ ప్రయోజనం కోసం ఉపయోగిస్తారంటేనే కంపరమెత్తుతుంది నాకు. ఆ సర్వేశ్వర్రావుగారు పిల్లనిస్తానంటే నా చెవులకు ఉద్యోగం ఇస్తానన్నట్టే వినిపించింది. నాకు సరిగా అర్థం కాలేదు. నీకు తన కూతుర్నిచ్చి పెళ్ళి చెయ్యటం ఆయన కెందు కిష్టం లేదూ ?"

ముకుందుడు తల ఎత్తి కుశాల్రావు కేసి చూశాడు. "సర్వేశ్వర్రావు అభిప్రాయంలో నేను నీకంటే గొప్పవాణ్ణి!" అని కుశాల్రావు అంటున్నట్టు అతనికి తోచింది.

"ఇస్తానంటే నేను చేసుకుంటానని భయమేమో!" అన్నాడు ముకుందుడు బెట్టుగా.

"అంతమాత్రానికి బెదిరేవాడుగాడే. నా అభిప్రాయం మార్చుకుంటే తనకు కార్డుముక్క రాయమన్నాడు!"

ముకుందుడు అనేదేమీ లేక తల వంచుకుని, తన ముందు పెట్టిన కాఫీ కలబోయసాగాడు.

"నేను డబ్బు సంపాదించడానికి రకరకాల ఆలోచనలు చేస్తుంటాను. కిందటేడు ఫోటోలుతీసి బతికాను. ఒక పాత క్వార్టర్ ప్లేట్ కామేరా పాతిక రూపాయలకు దొరికింది. రెండు డజన్ల ప్లేట్లూ, పేపర్లూ కొని పల్లెటూళ్ళకు వెళ్ళి పిల్లలకు ఫోటోలు తీసి కాపీ ఒకటి అర్థ రూపాయి చొప్పున అమ్మాను. నేను తీసుకుపోయిన ప్లేట్లూ, బ్రోమయిడు పేపరూ చాలలేదు. బిజినెస్ చాలా

చురుకుగా సాగింది. ఏ బిజినెస్ చెయ్యాలన్నా అంతో ఇంతో పెట్టుబడి కావాలి. స్వతంత్రంగా బతికేవాడికి పెట్టుబడి ఉండితీరాలి. సామాన్యంగా నాకు కావలసిన పెట్టుబడి గుర్రాలిస్తాయి. నా నికరాదాయం భీమా కంపెనీలిస్తాయి."

ముకుందుడు మాట్లాడలేదు. ఈ సంభాషణ అతనికి నిరర్థక మనిపించింది. కాని ముకుందుడి అనాసక్తిని కుశాలావు గమనించినట్లు కనబడలేదు.

"మొత్తంమీద బతుకు తెరువుకు పల్లెటూళ్ళకన్నా బస్తీలూ, పట్నాలూ మెరుగు. చిన్న చిన్న వూళ్ళల్లో ఉండదలిస్తే నేను పెళ్ళిచేసుకోనటానికి భయపడి ఉండును. పట్నంలో అలా కాదు. అవసరంవస్తే నా భార్యను సినిమాలలో ఎక్స్ట్రాగా పంపించినా పది, పదిహేను రూపాయలు తెస్తుంది! నాలుగు ముక్కలు మాట్లాడగలది కూడా అయితే ఇంకా ఎక్కువే తెస్తుంది!"

ముకుందుడీమాటలను చెవులు రిక్కించి విని "హరి తప్పుడు ముండాకొడకా!" అనుకున్నాడు. కుశాలావుకు ప్రపంచంలో డబ్బు తప్ప ఇంకోటేమీ లేదని అనుమానం కలిగింది ముకుందుడికి.

అయితే ముకుందుడికి ఒక చిక్కు కూడా ఎదురయింది. తాను కుశాలావును గురించి ఏమి అనుకుందామనుకున్నా ఏదో ఒక అభ్యంతరం ఉంటూనే ఉన్నది. పిచ్చిముండా కొడుకు అనుకుందామంటే పిచ్చి ముండాకొడుకులు రేసుల్లో వందలు సంపాదించడం అనుమానాస్పదం. డబ్బుకోసం

బతుకుతున్నా డనుకుంటామంటే, డబ్బు కావలసినవాడు తనకు తానై కట్నం వద్దనడు.

కాఫీ తాగడం ముగించి ఇద్దరూ లేచారు. బిల్లు కుశాల్రావు ఇచ్చాడు. ముకుందుడు ఇవ్వబోయినట్టు కూడా నటించలేదు.

ఆ రాత్రి కుశాల్రావు నిద్రపోయినాక ముకుందుడు తన తల్లినీ, తండ్రినీ పెరట్లోకి తీసుకుపోయి. "మనం ఈ సంబంధం మానుకోవటం మంచిదయింది!" అన్నాడు.

"ఏమిటి? ఏమిటి!" అని కమలమ్మ ఆత్రంగా అడిగింది. కుశాల్రావును గురించి తెలుసుకోదగిన ఘోరాలన్నీ అదివరకే తెలిశాయనే నమ్ముకుంటున్న ఆవిడకు ఇంకా కొత్త విషయాలుండటం ఆశ్చర్యంగా కనిపించింది.

"వీడు పట్టి గాలి తిరుగుళ్ళు తిరిగేవాడమ్మా! తనకు ఉద్యోగం చెయ్యడం ఇష్టం లేదని డాబులు కొడుతున్నాడు గాని వీడి కసలు ఉద్యోగం ఎవరిస్తారు? వాడిప్పుడు పెళ్ళి ప్రయత్నం తలపెట్టింది ఎందుకో తెలుసునా? పెళ్ళాంచేత ఎక్స్ట్రా వేషాలు వేయించి ఆ డబ్బుతో బతకడానికి! నేను ఎంత ఫూలునో వీడు గుర్రం పందాల్లో నిజంగా డబ్బు గడిస్తాడనుకున్నాను. అట్లా వందలకు వందలు సంపాదించేవాడు ఫోటోలు తీసి బతుకుతాడా?"

"ఫోటోలు తీసి బతకటమేమిట్రా?" అన్నాడు

"అట్లాకూడా బతికాట్ట — వాడే చెప్పాడు నాన్నా! డబ్బుకోసం వాడు ఏం చెయ్యటానికైనా సిద్ధమే!" అన్నాడు ముకుందుడు.

"అసలు ఈ విషయాలన్నీ అతను నీతో ఎందుకు చెబుతున్నాడని! ఈ సంబంధం తప్పించుకోవాలంటే ఏమేం చెప్పాలో అవన్నీ నీతో చెప్పాడు. దానికి కారణం ఏదో —"

ముకుందుడు మాట్లాడవద్దని తండ్రికి సంజ్ఞచేసి ఆలకించాడు. లోపల అలికిడి అయినట్టయింది. మళ్ళీ ఏమీ వినిపించలేదు.

"లేచాడేమో! చూసి వస్తా!" అంటూ ముకుందుడు లోపలికి వచ్చాడు. హాలులో మంచంమీద కుశాల్రావు లేడు. బయటి వాకిలి దగ్గరగా వేసిఉంది. గదిలో చంద్రావతి పడుకున్నది. అక్కడికేమైనా వెళ్ళాడేమోనని ముకుందుడు గదిలోకి వెళ్ళాడు. మంచంమీద చంద్రావతీ లేదు.

ముకుందుడికి రక్తపుపోటు వచ్చినంతపని అయింది. అతను నక్కను చూసిన వేటగాడులాగా అయిపోయి హాలులోకి వచ్చి, "చంద్రీ!" అని గట్టిగా కేకపెట్టాడు. జవాబు లేదు. మళ్ళీ కేక పెట్టాడు. పక్క వరండాలో ఉన్న బాత్‌రూమ్ వేపునుంచి చంద్రావతి లోనికివచ్చి తలుపు గడియ వేస్తూ, "ఎందుకా గావుకేకలు?" అన్నది.

"ఇతనేడీ?" అన్నాడు ముకుందుడు.

"ఏమో! నేను గదిలోనుంచి వచ్చినప్పుడే కనిపించలేదు!" అన్నది చంద్రావతి. ఆమె గదిలోకి వెళ్ళి తన పక్కమీద పడుకున్నది.

ముకుందుడు హాలునుంచి ముందు వరండాలోకి వెళ్ళాడు. కుశాల్రావు జాడ లేదు. ముకుందుడు బయటి గేటు తెరుచుకుని వీధిలోకి వెళ్ళాడు. దూరంనుంచి వస్తూ సన్నగా, పొడుగ్గా కుశాల్రావు కనిపించాడు.

ముకుందుడి మనసు స్థిమితపడింది. కుశాల్రావు రాత్రి పది గంటలప్పుడు ప్లేగ్రౌండ్ వేపు ఎందుకు షికారు వెళ్ళి ఉంటాడన్నది అతన్ని కొంచెంకూడా బాధించలేదు. అతను హాలు తలుపు దగ్గరగా వేసి తల్లినీ, తండ్రినీ కలుసుకున్నాడు. వాళ్ళింకా పెరట్లోనే మాట్లాడుకుంటున్నారు.

ఒక చెంప వాళ్ళు అనేమాటలు వింటూనే, కుశాల్రావు లోపలికి వచ్చి హాలు తలుపు వేసిన చప్పుడూ, అతను తన మంచంమీద పడుకున్న చప్పుడూ ఆలకించాడు ముకుందుడు.

ఒక్కందుకు ముకుందుడికి సంతోషమయింది. అనుమయ్యకు కుశాల్రావుమీద పూర్తిగా మనస్సు విరిగిపోయింది. ఆయన ఈ సంబంధాన్ని పూర్తిగా వదిలేసుకున్నాడు.

# 5

గడియారం పదకొండు కొట్టింది. అనుమయ్య భోజనంచేసి ఆఫీసుకు వెళ్ళాడు. చంద్రావతీ, కమలమ్మా ఆయన వెళ్ళగానే భోజనాలు చేశారు. మధ్యాహ్నం దాటిగాని ముకుందుడు కాలేజీనుంచి భోజనానికి రాడు.

కమలమ్మ కాస్సేపు నడుము వాల్చింది. ఇది ఆవిడకు విశ్రమించేవేళ.

"అమ్మా, సరోజావాళ్ళింటికి వెళ్ళి చదవటానికి ఏమన్నా తెచ్చుకుంటానే!" అన్నది చంద్రావతి.

"వెళ్ళి దబ్బునరా!" అన్నది కమలమ్మ ఆవలిస్తూ.

తరవాత ఆవిడ పడుకుని నిద్రపోయింది. ముకుందుడు భోజనానికి వచ్చినదాకా ఆవిడ నిద్ర లేవలేదు.

"చంద్ర ఏది?" అని ముకుందుడు మాటవరసగా అడిగాడు. అప్పుడుగాని కమలమ్మకు కూతురు సరోజా వాళ్ళ ఇంటికి బయలుదేరి వెళ్ళిన సంగతి జ్ఞాపకం రాలేదు.

"చదవటానికి పుస్తకాలు తెచ్చుకుంటానని సరోజా వాళ్ళింటికి వెళ్ళింది," అన్నది తల్లి.

ముకుందుడు గబగబా అన్నంతిని వెళ్ళిపోయినాడు.

అది మొదలు కమలమ్మ కూతురికోసం ఎదురు చూస్తూనే ఉంది. కాని చంద్రావతి తిరిగి రాలేదు.

గడియారం మూడు కొట్టింది.

"ఇంతసేపు ఎక్కడా ఉండదే! ఒకవేళ ఏ మూడు గంటల సినిమాకైనా తీసుకుపోయి ఉంటారా? చెప్పకుండా వెళ్ళదే!" అనుకున్నది కమలమ్మ.

నాలుగు కొట్టినదాకా ముళ్ళమీద ఉన్నట్టుగా ఉండి కమలమ్మ ఇంటికి తాళం పెట్టి సరోజా వాళ్ళ ఇంటికి బయలుదేరింది. వాళ్ళవీధి పక్కదేగాని, హోటల్ మీదుగా చుట్టూ తిరిగి వెళ్ళాలి. కష్టపడి వెళ్ళాక చంద్ర అక్కడికి రానేలేదని తెలిసింది.

కమలమ్మ గుండెల్లో రాయి పడింది. చాలాదూరం పరిగెత్తిన దానిలాగా ఆమెకు రొప్పువచ్చింది. మొహాన చెమటలు కమ్మాయి. పాదాలు విపరీతంగా పీక నారం భించాయి.

"చంద్రి ఎక్కడికి వెళ్ళినట్లు? ఏమైనట్లు? పాపిష్టి పూరు — నమ్మటానికి లేదు. పత్రికల్లో ఎప్పుడూ ఘోరాలు పడుతూనే ఉంటాయి. ఎవరెవరో ఆడవాళ్ళను ఎత్తుకుపోతూంటారు. చంపి ఎక్కడో పారేస్తుంటారు. మెళ్ళో గొలుసు మాత్రమే ఉంది! వాళ్ళ ప్రాణానికి అది చాలదూ! పైపెచ్చు ఈడొచ్చిన పిల్ల! "నేనేం చేతును?" అన్నమాట ఆవిడ మనసులో అలారంలాగా కొట్టసాగింది.

ఆవేదన ఆవిణ్ణి నిలువునా దహించేస్తున్నది. బుర్ర పని చెయ్యడంలేదు. అందులో చెలరేగే హోరులో ఒకక్షే

స్పష్టమైన ఆలోచన ఉన్నది. ముకుందుడు దబ్బున ఇంటికి వస్తే బాగుండును! "నాయనా! భగవంతుడా! ముకుందుణ్ణి దబ్బున ఇంటికి పంపించు!" అని చాలాసార్లు అనుకున్నది. తరవాత కాస్సేపటికిగాని ఆవిడకు తట్టలేదు—చంద్రినికాపాడమనికూడా భగవంతుణ్ణి ప్రార్థించవచ్చునని.

ఎంతోసేపు గడిచినట్టు అయింది. తాను ఇంకా సరోజావాళ్ళ వరండాలోనే ఉండడం గమనించింది కమలమ్మ.

"మా యింటికని బయలుదేరి ఎంతసేపయింది?" అని సరోజ ఆరవంలో అడిగింది.

కమలమ్మ తడబడుతూ, తడుముకుంటూ సమాధానం చెప్పింది.

తన స్నేహితురాలు అయిదు గంటల క్రితమే ఇల్లు విడిచి వెళ్ళిందనగానే సరోజకు కూడా ఆదుర్దా కలిగింది. ఆ పిల్ల కమలమ్మను వెంటబెట్టుకుని రెండిళ్ళ అవతలఉన్న ఇంటికి పోయి టెలిఫోను డైరక్టరీ తీసింది.

అప్పుడుగాని కమలమ్మకు తన భర్తసంగతి జ్ఞాపకం రాలేదు.

"సరోజా, కొంచెం మా వారికి టెలిఫోను చెయ్యి," అన్నదావిడ అరవంలో.

"అదే చేస్తున్నాను" అంటూ సరోజ టెలిఫోన్ డయల్ చేసింది.

అవతల అనుమయ్య పలకగానే సరోజ టెలిఫోను కమలమ్మ కిచ్చింది. కాని కమలమ్మ మాట్లాడలేక పోయింది. టెలిఫోనులో తన భర్త గొంతు వినిపించగానే ఆవిడకు ఆగకుండా దుఃఖం వచ్చేసింది. సరోజ చప్పున పట్టుకోకపోతే టెలిఫోను ఆవిడ చేతిలోనుంచి కింద పడిపోయివుండును.

సరోజే అనుమయ్యకు జరిగిన సంగతి, మధ్య మధ్య కమలమ్మ సహాయం తీసుకుంటూ చెప్పింది.

టెలిఫోనుమీద అనుమయ్య అట్టే కంగారుపడ్డట్టు కనిపించలేదు.

"భయపడకండి, ఏమీ భయం లేదు!! మీవారు టాక్సీ చేసుకునో, కంపెనీ కారులోనో వెంటనే వస్తున్నారు," అంటూ సరోజ కమలమ్మను వాళ్ళింటికి తెచ్చి, అక్కడే తోడు కూచున్నది.

అనుమయ్య కంపెనీ కారులో బయలుదేరి మొట్టమొదట తగిలిన పోలీసు స్టేషనులో తన కూతురు కనిపించడం లేదని రిపోర్టిచ్చాడు. తరవాత ఆయన కాలేజీకి వెళ్ళి ముకుందుణ్ణి కారులో ఎక్కించుకున్నాడు.

అంతా విని ముకుందుడు, "ఇది వాడి పనే అయివుంటుంది!" అన్నాడు.

అంతవరకూ చంద్రావతి కనిపించకపోవడానికీ, కుశాగ్రావుకూ సంబంధం ఉంటుందని శంకించినవారెవరూ లేరు.

"వాడేం చేశాడంటావూ?" అన్నాడు అనుమయ్య.

"నిన్నరాత్రి మనం దొడ్లో మాట్లాడుకుంటున్న సమయంలో వాడు దానితో రహస్యంగా ఏదో ఏర్పాటు చేసివుంటాడు!"

అది అనుమయ్యకు సవ్యంగా కనుపించలేదు. కుశాల్రావు వెళ్ళిపోతానంటే తానే వుంచేశాడు. అటువంటప్పుడు అతను చంద్రితో ఏం మాట్లాడి వుంటాడు? ఒక్కొక్క-సారి ముకుందుడి ఆలోచనలు అతుకునందవు, పోను పొందవు.

"నీ మొహం," అన్నాడాయన.

"కాదు, నాన్న. మనం వెంటనే హోటలుకు పోదాం!" అన్నాడు ముకుందుడు.

అంతకన్నా చేసేదేమీ లేదు గనకనూ, అనుమానం తీరినట్టుంటుందనీ అనుమయ్య ఒప్పుకున్నాడు.

మధ్యదారిలో ముకుందుడు తన తండ్రి చెయ్యి పట్టుకొని వెర్రెత్తినవాడిలాగా లాగుతూ, "నేను పొరపాటు పడ్డాను. రాత్రి వాళ్ళిద్దరూ మాట్లాడుకోలేదు—" అన్నాడు.

అనుమయ్య కొడుకుకేసి కోపంగా చూసి, "నీకన్న కోతి నయం! హోటలుకు పోనవసరం లేదంటావా! కాసు మనది కాదు కూడా!" అన్నాడు.

"హోటలుకు పోయి తీరాలి. ఆ దుర్మార్గుడు మనమంతా వింటుండగానే దానికి చెప్పవలసిందంతా చెప్పాడు!"

"'వెర్రికుదిరింది రోకలి తలకు చుట్టనున్నాట్ట' మన మంతా వింటుండగా దానితో వాడేం చెప్పాడంటావు?"

"ఇంకేం చెప్పాలి? హోటలూ, గది నంబరూ చెప్పాడు. అతను పెళ్ళాడాలని వుంటే నీ మాటా, అమ్మ మాటా వినవద్దనికూడా చెప్పాడు. చాలదూ?"

"ఏడిసినట్టే వుంది. వాడు దాంతో అసలు మాట్లాడందే!"

"మనతో మాట్లాడితే అది వినటంలేదూ? వాడి గదినంబరు మనం అడిగామా, పెట్టామా? ఎందుకు చెప్పాలీ?"

"ఆఘోరించినట్టే వుంది! చెబితే ఏమయిందంటావు?"

"అది నేరుగా వాడి గదికి వెళ్ళింది!"

"చాల్లే నోరుముయ్!" అన్నాడు అనుమయ్య.

ఇంతలో కారు హోటలుకు చేరనే చేరింది. ముకుందుడు రిసెప్షనిస్టు దగ్గరికిపోయి "పన్నెండో నంబరు గది ఎక్కడ?" అని అడిగాడు.

"గదిలో ఇప్పుడెవరూ లేరు," అన్నాడు రిసెప్షనిస్టు.

"ఖాళీ చేశాడా?"

"లేదు. బయటకు వెళ్ళాడు."

"అతనికోసం ఎవరన్నా వచ్చారా?"

"ఒక పిల్ల వచ్చింది?"

అనుమయ్య తెల్లబోయాడు. ముకుందు డాయనకేసి గర్వంగా చూశాడు.

"ఆ పిల్ల ఏ వేళకు వచ్చింది?" అని అనుమయ్య అతన్ని అడిగాడు.

"పన్నెండుకు ముందే వచ్చింది."

"ఇద్దరూ కలిసి బయటకు వెళ్ళారా?"

"అవును, టాక్సీ చేయించుకు వెళ్ళారు. ఇదంతా ఎందుకు అడుగుతున్నారు?" అన్నాడు రిసెప్షనిస్టు తన వాక్కులు జ్ఞాపకంవచ్చి.

"ఆ పిల్ల మాపిల్లే అయివుంటుంది. కొంచెం పొట్టిగా వుంటుంది పెద్ద జడ. చామనచాయరంగు. కళ్ళు కొంచం చిన్నవి. అట్టే లావుండదు, మరీ సన్నంగానూ వుండదు. పంధొమ్మిదో ఏడు."

"అవును ఆ పిల్లే. ఆయన మీ బంధువా?" అని హోటల్ మనిషి అడిగాడు.

కాదనబోయి అనుమయ్య అవునన్నాడు, ఎందుకైనా మంచిదని.

"అయితే వాళ్లు రాగానే మీరు వచ్చారని చెబుతాను. మీ పేరు, ఎడ్రసూ ఇచ్చి వెళ్ళండి," అన్నాడు హోటల్ వాడు.

తండ్రీ కొడుకులు ఒకళ్ళ మొహాలు ఒకరు చూసుకున్నారు. అనుమయ్య తన పేరూ, ఎడ్రసూ ఇచ్చాడు. ఇద్దరూ బయటికి వచ్చారు.

"నువ్వు కారులో ఇంటికి వెళ్ళి అమ్మకు చెప్పు. ఆవిడ గాభరా పడుతూంటుంది. నే నిక్కడే తిష్ఠ వేసి ఈ సంగతేవో తేలుస్తాను" అన్నాడు ముకుందుడు.

"నేనుకూడా వుంటే?" అన్నాడు అనుమయ్య.

"అక్కడ అమ్మ గుండెలో రైళ్ళు పరిగెత్తుతూ ఉంటై, మధ్యాహ్నం వెళ్ళిన మనిషి మళ్ళీ రాకపోతే ఆవిడకు ఎట్లా ఉంటుందో వూహించలేవా? నీ కెందుకు టెలిఫోన్ చేయించిందనుకున్నావు?"

ముకుందుడికిలో అనుమయ్యకు ఏ మాత్రమూ విశ్వాసం లేదు. వాడు ఏ పనీ చెయ్యలేడన్న నమ్మకం కూడా వున్నది. కాని ఆ మాట అనడానికి లేదు; జరిగిన సంగతి సరిగా వూహించినది వాడేకద! అందుచేత అనుమయ్య ఇష్టం లేకుండానే కారెక్కి ఇంటికిబయలుదేరాడు.

ముకుందుడు బంకులో ఒక సిగరెట్టుపెట్టె కొని, సిగరెట్టు కాలుస్తూ, కాలు కాలిన పిల్లిలాగా అటూ ఇటూ పచార్లు చేస్తూ, గేటులోనుంచి వచ్చే ప్రతి టాక్సీ కేసి చూడసాగాడు.

ఇంటిదగ్గర అనుమయ్య తన భార్యతో, "ఏమీ సందేహం లేదు. చంద్రి ఎందుకు వెళ్ళిందో వాడి గదికి వెళ్ళింది వాళ్ళిద్దరూ కలిసి ఎక్కడికో వెళ్ళారు. వెళ్ళిన వాళ్ళు తిరిగి రాకపోరుగా. మన ముకుందుణ్ణి అక్కడే పెట్టి మరీ వచ్చాను. సంగతి సందర్భాలేమిటో వాడు తెలుసుకుని వస్తాడు," అన్నాడు.

"నేను నమ్మను. మన అమ్మాయి హోటల్లో వాడి దగ్గరికి ఎంతుకు పోతుంది? దాన్ని ఎవరో చంపేసి ఎక్కడో పారేసి వుంటారు! ఇంకొకళ్ళయితే పట్నమంతా కలయచుట్టి వుందురు. మీరు ఎవరిమాటలో నమ్మి ఇంటికి వచ్చేశారు. నా పిల్లకూ నాకూ ఈనాటితో రుణం తీరి పోయింది గామాలు!" అంటూ కమలమ్మ బావురుమన్నది.

"అది వాడి గదికి వచ్చిందని హోటల్ వాడు చెబుతుంటేనే? ఏమిటి నీ అఘాయిత్యపు ఏడుపు? పట్నమంతా చుట్టబెట్టటం మాటలా? పోలీసు రిపోర్టిచ్చాం. అంతకంటే ఏం చెయ్యగలం? ముకుందుడు ఇంటికి వచ్చేదాకా అయినా కాస్త ఓపిక పట్టూ!"

తన కొడుకు ప్రయోజకుడేనని కమలమ్మ ఎరుగును కాని, వెనకనుంచి తాను నడిపించినట్లయితే వాడి తెలివి తేటలు మరింత రాణిస్తాయని ఆవిడ నమ్మకం. తన మొగుడి నాయకత్వంకింద వాడి ప్రయోజకత్వం ఎందుకూ పనికి రాదని ఆవిడ భయం.

అనుమయ్య అటూ ఇటూ కాస్సేపు తిరిగి "ఈ సంబంధం మాకునేముందు మనం చంద్ర అభిప్రాయం కూడా పాటిస్తే బాగుండేది. దానికి ఒకవేళ వాణ్ణి చేసుకోవాలని బాగా ఉండేదేమో!" అన్నాడు.

"ఉంటే మనతో చెప్పకూడదూ?" అన్నది కమలమ్మ.

"చెప్పికూడా లాభం ఉండదని అనిపించేటట్టు నువ్వే చేశావు. నీకు చక్రం తిప్పటమంటే ఉన్నంత ఇష్టం ఇంకేందులోనూ లేదాయె. నిన్నరాత్రికూడా 'నేను ముందే నిశ్చయించాను' అంటివే! చూడు నీ నిశ్చయం ఎట్లా తగలబడిందో! నువ్వు నిశ్చయించగానే అది భగవంతుడి నిశ్చయమే అనుకుంటావు. చూడు, నీ మూలంగా ఏం గతి వచ్చి పడిందో!"

"మూలిగే నక్కమీద తాటికాయ పడినట్లు మీరు అయిందానికీ, కాని దానికీ నన్నంటారేమిటి? నా కూతురు ఇటువంటి సంబంధం వద్దుబాబో అనటమేనా నా వల్ల అపచారం? అంటాను, లక్షసార్లు అంటాను, ఈ సంబంధం పగవాళ్ళకూడా వద్దు!" అన్నది కమలమ్మ, తన కూతురి కోసం ఏడవటంకూడా పూర్తిగా మరిచిపోయి.

ముకుందుడు ఎంతకూ తిరిగి రాలేదు.

ఎనిమిదయింది.

"వాడు వస్తాడులే. అన్నట్టు వంట ప్రారంభించావా?" అన్నాడు అనుమయ్య.

"మన బతుకు వంటల్లోనే వుంది!" అన్నది కమలమ్మ నెత్తిన చేతులు పెట్టుకుని.

తిండివిషయం ఇంక మట్లాడితే తన భార్యదృష్టిలో తాను కూతురిపై అపేక్ష లేనివాడై పోతాడని ఆయన అర్థం చేసుకున్నాడు. కమలమ్మ ఈ పూట వంటచేసేటట్టు లేదు. ఆయన పై బట్ట వేసుకుని బయలుదేరాడు.

"మీరు మళ్ళీ ఎక్కడికి ?" అన్నది కమలమ్మ.

"హోటలుకు ఒకసారి వెళ్ళి వస్తాను."

"మనవాడు అక్కడే ఉన్నాడంటిరిగా ? మీరు కూడా దేనికి ?"

"కనీసం వాడికి టెలిఫోను చేసి సంగతులు తెలుసుకొస్తా," అంటూ అనుమయ్య బయట పడ్డాడు.

ఆయన నేరుగా కాఫీ హోటలుకు వెళ్ళాడు. సాయంత్రం వేసిన ఇడ్డెను రెండు తిని కాఫీ తాగాడు. తరవాత అడ్వొకేటు శివరామయ్యగారి ఇంటికి వెళ్ళి హోటలుకు టెలిఫోను చేసి, "పన్నెండో నెంబరు రూమువాళ్ళు వచ్చారా ?" అని అడిగాడు.

ఇంకా రాలేదని జవాబు వచ్చింది.

"అక్కడ ముకుందరావని ఎవరన్నా ఉన్నారా ?"

"ఇక్కడ ఆ పేరు వాళ్ళెవరూ లేరుసార్," అంటూ హోటలువాళ్ళు టెలిఫోను పెట్టేశారు

అనుమయ్యకు ఇంటికి పోబుద్ధి పుట్టలేదు. తన భార్య ఇంతకూ మూలకారకురాలన్న సంగతి ఆయన మనస్సులో బాగా నాటుకుపోయింది. ముకుందుడు కూడా ఉల్లి తప్పే ఎగిరిన మాట నిజమేగాని, వాడు ఒక్కడూ అయితే తాను లక్ష్యపెట్టేవాడు కాడు అరడజనుసార్లు అయినా తను కుశాల్రావు సంబంధం చేసుకోవచ్చునని నిశ్చయానికి వచ్చాడు. ప్రతీసారీ-ప్రతీసారి పడగొట్టింది! నోటికి వచ్చిన

మాటలన్నీ అన్నది! తన కూతురి మనస్సే తెలుసుకోలేక పోయిన మనిషి మొగుడి మనస్సు ఏం తెలుసుకుంటుంది?

ఒక గంటసేపు రోడ్లవెంబడి తిరిగినాక ముకుందుడు ఇంటికి వచ్చివుండవచ్చునని తట్టి అనుమయ్య ఇంటిదారి పట్టాడు. ఆయన ఇల్లు చేరేసరికి పది కావస్తున్నది. ముకుందుడింకా రాలేదు.

కమలమ్మ ఏ బుద్ధిన ఉన్నదో అన్నం మూటుకు వండింది.

"పదికూడా అయింది ఎంతసేపు వీడికోసం చూస్తారు? అన్నం తినెయ్యండి. ఈ పూట మీకు పచ్చడి మెతుకులే!" అన్నది కమలమ్మ.

"నువ్వు?" అన్నాడు అనుమయ్య.

"నేను తినను," అన్నది కమలమ్మ, వ్రతంపట్టినట్టు.

"నాకేమీ ఆకలిలేదే! వాణ్ణికూడా రానీ!"

"బయటకు వెళ్ళి ఏదో తినివుంటారు"

అనుమయ్యకు ఇందుకే పెళ్ళాన్ని చూస్తే మండేది. చూసినట్టుగా నిజం పలేస్తుంది. వెధవ విద్య!

"నేను కాస్త కాఫీ అయినా తాగాను. పాపం మన వాడు పచ్చి నీళ్ళుకూడా లేకుండా వున్నాడు."

"టెలిఫోను చేస్తామంటిరిగా?"

"చేశాను. వాళ్ళింకా రాలేదుట."

"వాళ్ళేవరు?"

"అదే, అమ్మాయీ, ఆ కుశాల్రావునూ!"

"మీ కేంత పిచ్చి?"

"ఎవరికి పిచ్చో తెలుస్తుందిగా—ముకుందుణ్ణి రానీ!"

పదకొండింటిదాకా చూసి అనుమయ్య అన్నం తినేశాడు. తరవాత ఆయన మంచంమీద అలా నడుము వాల్చి తనకే తెలియకుండా నిద్రపోయాడు.

ముకుందుడు కాళ్ళీడ్చుకుంటూ ఇల్లు చేరేసరికి ఒంటిగంట కావచ్చింది.

ముకుందుడు తలుపు తట్టిన చప్పుడుకు నిద్రలేచిన అనుమయ్య, "ఏమయిందిరా?" అని కొడుకును అడిగాడు,

"ఏమీ కాలేదు. ఆఖరు సినిమాలు వదిలినదాకా అక్కడే ఉన్నాను. వాళ్ళు రానేలేదు. నాకు బస్సులు అందలేదు. ఒక్క టాక్సీగాని, ఆటో రిక్షా గాని దొరకలేదు. రిక్షావాళ్ళు రెండు రూపాయలడిగారు; నడిచి వచ్చాను" అన్నాడు ముకుందుడు.

"అమ్మాయి కనిపించనే లేదా, నాయనా?"అన్నది కమలమ్మ మళ్ళీ మళ్ళీ ఏడుస్తూ.

అనుమయ్యకు పెళ్ళాన్ని చూస్తే జాలివేసింది. ఆయన బాధగా మూలిగాడు.

ముకుందుడు మాత్రం "అన్నం పెట్టమ్మా, ఆకలి దహించుకు పోతున్నది. వాళ్ళ సంగతి రేపు చూస్తాను" అన్నాడు.

మర్నాడు ఉదయం అనుమయ్య పళ్లు తోముకుంటుండగా కమలమ్మ రొప్పుతూ వచ్చి, "ఆ దౌర్భాగ్యుడు వస్తున్నాడు!" అన్నది. కుశాల్రావు గేటు తెరుచుకుని వస్తుండగా చూసి గబగబా ఆవిడ భర్తకు చెప్పటానికి వచ్చింది.

"అమ్మయ్యో!" అన్నాడు అనుమయ్య.

"అది లేదు."

"అది ఏమయిందో కనుక్కో!" అన్నాడు అనుమయ్య.

"నే నా ఛండాలుడితో మాట్లాడను. మీరే వెళ్ళి అడగదలచిన నాలుగు మాటలూ అడగండి. పీడలాగా దాపరించాడు, వీడి నోరుబడ!" అన్నది కమలమ్మ అక్కసు పట్టలేక.

"మనవాడు లేచాడా?"

"ఇంకా లేదు, వాడు నోరు దురుసుగా మాట్లాడతాడు. వాడెందుకు లెండి? మీరే త్వరగా కానిచ్చి వెళ్ళండి!" అన్నది కమలమ్మ.

కాని ఈ లోపలే ముకుందుడు నిద్ర మేలుకుని, ఊడిపోయిన బట్టను సరిగా కట్టుకుంటూ లేచివచ్చి కుశాల్రావును చూసి, "హాఁ!" అన్నాడు.

"నిన్న పొద్దున నేను మీ ఇల్లు వదలి వెళ్ళిపోయేటప్పుడు మళ్ళీ ఇరవైనాలుగు గంటలలో ఈ గడప

తోకుక్కతానసీ, మళ్ళీ మీతో మాటాడవలసివస్తుందనీ ఊహించలేను. నన్ను ఎందుకు మీరు వెంటాడుతున్నారో నాకర్థం కావటం లేదు!" అన్నాడు కుశాల్రావు చాలా కోపంమీద ఉన్నవాడల్లే.

"మా చంద్రి ఏదీ?" అన్నాడు ముకుందుడు, అతని ఆగ్రహానికి కారణం తెలీక.

"ఏదీ అంటే ఫౌంటెన్ పెన్నా, జేబులో పెట్టుకు రావటానికి? నా హోటలు గదిలో ఉన్నది. చాతయితే తీసుకురండి?" అన్నాడు కుశాల్రావు.

"హోటలు గదిలో ఏం చేస్తున్నది? అక్కడ దానికేం పనీ?"

"ఆ సంగతి తెలుసుకుందామనే వచ్చాను. ఎవరో చెప్పి పంపించకపోతే ఆ పిల్ల తనంతట తాను మిట్ట మధ్యాహ్నం పన్నెండు గంటలప్పుడు నా హోటలు గదికి వస్తుందా? నేను నమ్మను. ఇంటికి వెళ్ళిపొమ్మని నయానా, భయానా చెప్పాను. రెండు గంటలు చెప్పినా వినలేదు. అప్పటి కప్పుడు టాక్సీ తెప్పించి ఎన్నూరు బయలు దేరాను. అలాగైనా మనసు మార్చుకుంటుందేమోనని. నాకంటె ముందుగా టాక్సీలో ఎక్కి కూచున్నది" అన్నాడు కుశాల్రావు.

"నేను ఒక్క మాటకూడా నమ్మను. ఆ టాక్సీని ఇక్కడికే ఎందుకు తీసుకురాలేదూ?" అన్నాడు ముకుందుడు. ఈ సనుమానానికి అనుమయ్యకూడా వచ్చాడు.

కుశాల్రావు ఆరోపణను లక్ష్యపెట్టక, "ఆ పిల్లను బలాత్కారంగా మీకు వప్పగించటానికి నే నేమన్నా ఆమెకు గార్డియనునా? పైగా ఆమె మేజరు! ఇంటినుంచి ఎందుకు పారిపోయిందో నాకు తెలియదు!" అన్నాడు.

"ఎందుకు పారిపోయిందో చెప్పలేదా?"

"నే నడిగితే చెప్పేదేమో, నే నడగలేదు."

"రాత్రి పన్నెండు దాకా మీ రిద్దరూ ఎక్కడ ఉన్నారు?" అన్నాడు ముకుందుడు, అనుమానితుణ్ణి ప్రశ్నించే పోలీసు అధికారిలాగా.

తెల్లవారి అయిదింటిదాకా ఎన్నూరు హోటల్లోనే వున్నాం" అన్నాడు కుశాల్రావు.

"ఇంతకూ అమ్మాయేదిరా?" అన్నాడు అనుమయ్య కొడుకుతో.

"హోటలు గదిలో ఉందిట" అన్నాడు ముకుందుడు చిన్న గొంతుతో.

"అక్కడికి ఎందుకు పోయిందిటా?"

"ఏమో ఎవడికి తెసుసు? మనం పంపించామంటు న్నాడు ఈయనగారు."

"నే నా మాట అనలేను. భయభక్తులతో పెరిగిన పిల్ల తనంతట తాను సాహసించి వచ్చేస్తుందా అని అడుగు

తున్నాను. ఈసారి అడిగేవాణ్ణి నేనూ, చెప్పేవారు మీరూనూ!" అన్నాడు కుశాల్రావు.

"అదెందుకు రాలేదుటా?" అన్నాడు అనుమయ్యా మళ్ళీ కొడుకుతోనే. ఎందుకనో ఆయన కుశాల్రావుతో మాటలు లేనివాడల్లే ప్రవర్తించాడు.

"నాకు మటుకేం తెలుసు నాన్నా? గానన్నదిట! కావలిస్తే పోయి దాన్నే అడుగుదాం. బట్టలు వేసుకో" అన్నాడు ముకుందుడు చిరాకుగా.

"అయ్యో! అయింది చాలక ఈ అప్రతిష్ఠకూడా ఏమిటండీ? ఈ సంగతి నలుగురికీ తెలిస్తే కింద ఉమ్మేస్తారా?" అని దూరంనించి కమలమ్మ విలవిల్లాడింది.

"కాదా మరి! అయినా నేను మాత్రం మీ అమ్మాయి విషయంలో చాలా పెద్దమనిషి తరహాగా ప్రవర్తించాను. అందులో మీకేమీ సందేహం అక్కర్లేదు. పెళ్ళిగావలసిన పిల్ల కూడాను!" అన్నాడు కుశాల్రావు.

ఈ మాటలకు అనుమయ్యా కూడా ఆగ్రహించాడు.

"అంత పెద్దమనిషివి, ఈ రావటం నిన్న మధ్యాహ్నమే రావలసింది!" అన్నాడాయన.

"మీ అమ్మాయి ఇంత దూరం పోతుందని నేను మాత్రం అనుకున్నానా? కొంత అమాయకత్వం కూడా వుందనుకుంటాను. ప్రపంచజ్ఞానం వున్న పిల్ల అయితే నిన్న రాత్రి ఒంటరిగా నాతో ఆ ఎన్నూను హోటలు గదిలో గడపదు!"

"ఆ హోటల్లో ఇంకెవరన్నా వున్నారా రాత్రి?" అని అనుమయ్య అడిగాడు.

"మేమిద్దరం తప్ప ఇంకెవ్వరూ లేరు" అన్నాడు కుశాల్రావు.

"ఏం ప్రారబ్ధం వచ్చి పడిందిరా భగవంతుడా!" అన్నాడు అనుమయ్య. "ఇప్పుడింతకూ ఎక్కడుంది?"

"ఇక్కడే నా హోటలు గదిలో వుంది."

"వుందా, మళ్ళీ ఎక్కడైనా దాచావా?"

"దాచదలచినవాణ్ణయితే నా కిక్కడికి రావలసిన కర్మమేమిటి? నాకు మీ అమ్మాయిలాంటి రంభ మరి దొరకదనా? ఎందుకు దాస్తానూ? మీ పిల్లను జాగ్రత్త చేసుకోలేని తప్పుకు ఇతరులను గురించి అసహ్యంగా మాట్లాడకండి. అది పెద్దమనిషి లక్షణం కాదు. మీరు వస్తారని ఎక్కడికైనా పారిపోతుందేమోనని భయంతో గదిలో పెట్టి తాళంవేసి మరీ వచ్చాను" అన్నాడు కుశాల్రావు.

భార్యాభర్తలిద్దరూ ఒకరిముఖం ఒకరు చూసుకున్నారు. ఆ తాళం అతని నిర్దోషిత్వానికి మహా ప్రబల సాక్ష్యంగా వారిద్దరికీ తోచింది.

"ఈ కుశాల్రావు నా కొంపలో అడుగు పెట్టినప్పటి నుంచీ నా జీవితమంతా ఇట్లా తారుమారు కావటానికి ఏమిటి కారణం?" అనుకున్నాడు అనుమయ్య తనలో.

తీరా అనుమయ్యా, ముకుందుడూ హోటలుకు బయల్దేరబోయే సమయానికి కమలమ్మ "ఏమండీ! నేను కూడా రానా? అది నా మాట వింటుంది!" అన్నది.

"మా మాట వినకపోతే నువే వెళుదువుగానిలే!" అన్నాడు అనుమయ్య.

ముగ్గురూ కలిసి బస్సు పట్టుకొని హోటలుకు చేరుకున్నారు.

కుశాల్రావు గదికి తాళం వేసిన మాట నిజమే. లోపల చంద్రావతి ఎంతో స్వతంత్రంగా మంచంమీద బోర్లపడుకుని కాళ్ళు ఆడిస్తూ ఏదో బొమ్మల పత్రిక తిరగ వేస్తున్నది.

"ఏం నాన్నా! ఏం అన్నయ్యా?" అంటూ ఆమె తన తండ్రినీ, అన్ననూ నవ్వుతూ పలకరించింది.

"ఇదేం పనే?" అన్నాడు ముకుందుడు కోపంగా.

"నా యిష్టం!" అన్నది చంద్రావతి.

"గొప్పపని చేశావు, యింటికి పోదాం రా!" అన్నాడు అనుమయ్య.

"నేను రాను, నా యిద్దరికీ పెళ్ళి చేసేటట్టయితేనే వస్తాను. మీ అందరి యిష్టాలూ విని విని తలపట్టిపోయింది. ఇకముందు నా ఇష్టమేమిటో మీరు వినండి!" అన్నది చంద్రావతి.

"పెళ్ళి నీ ఇష్టమేనా ఏం? అతను ఇష్టపడొద్దూ?" అన్నాడు తండ్రి.

"ఆయన యిష్టపడ్డప్పుడు మీరంతా ఏంచేశారు? చాతయితే ఆయన్ని ఒప్పించండి!" అన్నది చంద్రావతి.

అనుమయ్యా, ముకుందుడూ ఒకరి మొహం ఒకరు చూచుకున్నారు. వారి చూపులు మాట్లాడుకున్నై. "దీని కెంత తెలివి వచ్చిందిరా!" అన్నది అనుమయ్య చూపు. "అదే!" అన్నది ముకుందుడి చూపు.

ఈ సంభాషణ జరిగేటప్పుడు కుశాల్రావు అక్కడ లేడు. అతను తాళం తీసి తలుపు తెరిచి గది బయటనే నిల బడి అటునించి అటే వెళ్ళిపోయాడు.

ఇప్పు డతను హోటలు బోయి చేత ఇడ్లీప్లేట్లు పట్టిం చుకు వచ్చాడు. మారుమాటాడకుండా తండ్రీ కొడుకు లిద్దరూ చెరొక ప్లేటు అందుకున్నారు. చంద్రావతి మంచం మీదనే బాసిపెట్టువేసి కూచొని చెయ్యి చాచి ఒక ప్లేటు అందుకున్నది. దాన్ని చూస్తున్నకొద్దీ ముకుందుడికి మండి పోతున్నది. కాని ఏ మూలో దానిపైన పూర్వం ఎన్నడూ లేని గౌరవం కూడా తల ఎత్తింది.

ఇడ్లీ తింటూండగానే కాఫీకూడా వచ్చింది. బోయి తలుపు మూసి వెళ్ళిపోగానే కుశాల్రావు,"మీరూ మీరూ మాట్లాడుకున్నారా?" అని అనుమయ్యను అడిగాడు.

"అది నిన్నే చేసుకుంటానంటున్నది" అన్నాడు అనుమయ్య, తాను తన కూతురికి జవాబుదారీ కానట్టుగా.

"ఆ పిల్ల ఇష్టం అట్టే లేదనుకుంటానే. ఆ అమ్మాయి మొదటినుంచీ నన్ను చేసుకుందామని ఉన్నట్టే నాకర్థ మయింది. కాని ఆ విషయం ఆలోచించినవారెవ్వరూ లేకపోయారు. ఒకప్పుడు నేనుకూడ ఇష్టపడేవాణ్ణి. అందుకు నాకు మీరు చేసినదేమంటే నన్ను అనుమానించారు, నా డబ్బుకూడా కాజేశారు. ఇప్పుడు నాతో మీరు ఆ పిల్ల యిష్టంగురించే చెప్పటంలో మీ ఉద్దేశ్య మేమిటో నాకు అర్థం కాకుండా వుంది" అన్నాడు కుశాల్రావు.

"ఇదంతా శుష్కవాదన. ఒకప్పుడు నేను కూడా నీకు పిల్ల నిద్దామనే అనుకున్నాను. కాని నేను తగినంత స్వతంత్రుణ్ణి కాను. అందుకే నా యిష్టప్రకారం చెయ్య లేక పోయినాను. ఇప్పుడు పరిస్థితులు మారినై. దాన్ని నీకిచ్చి పెళ్ళి చెయ్యకపోతే మా పరువు దక్కదు. అది నిన్న రాత్రి అంతా ఒంటరిగా నీ వెంట వున్నది" అన్నాడు అనుమయ్య.

"మీరు స్వతంత్రులు కాకపోతే, మీలో స్వతంత్రులెవరో నిర్ణయించుకుని ఈ పెళ్ళి సంభాషణలు చేస్తే బాగుంటుంది. అదికూడా నాతో కాదు. నేను కూడా ఇప్పుడు స్వతంత్రుణ్ణి కాదు. పెళ్లి విషయంలో నేనిక ఎంతమాత్రమూ స్వతంత్రించననీ, మా నాన్న చెప్పినట్టు నడుచుకుంటాననీ నిన్ననే మా నాన్నకు రాసేశాను. ఇక

మీ పరువు మాటంటారా? దానికి నేనైనా ఏమీ విఘాతం కలిగించలేదు. నేను మీ అమ్మాయిని ఇంటినుంచి లేచి రమ్మనలేదు. పైపెచ్చు ఇంటికి వెళ్ళమని కూడా చెప్పాను. అందుచేత ఇందులో నా బాధ్యత ఏమీ లేదు" అన్నాడు కుశాల్రావు.

"నేను మొదట కూడా మీ నాన్నగారికి రాశాను. కాని ఆయన నా రెండు ఉత్తరాలకూ జవాబివ్వలేదు. ఇప్పుడిస్తారని ఏమిటి?" అన్నాడు అనుమయ్య.

"మా నాన్నకు కట్నం కావాలి. పదివేలకు తక్కువయిస్తే ఆయన వినిపించుకోడు. మీ ఉత్తరానికి జవాబు కూడా వ్రాయడు."

అనుమయ్య తెల్లబోయి, నా కున్నదంతా తెగనమ్మితేగాని పదివేలు కట్నం యివ్వలేను" అన్నాడు.

"నేను మిమ్మల్ని యిమ్మనలేదు. నాకు చేసిన సత్కారమేదో చేశారు. ఇంతటితో నన్ను వదలిపెట్టి మీ అమ్మాయిని మీరు తీసుకుపొండి. నా సమస్యలతో నేను సతమతమవుతూంటే, మీ సమస్యలతో నన్నెందుకు చంపుతారు?"

అనుమయ్య కాసేపు ఆలోచించి "ఇది ఇంతలో తేలే విషయంకాదు. ఇంటికి పోదాం రావే అమ్మాయ్!" అన్నాడు.

"నేను రాను. చెప్పానుగా, ఆయన్ని పెళ్ళికి ఒప్పించండి!" అన్నది చంద్రావతి.

"నాన్నా, ఒకసారి బయటికి రా!" అంటూ ముకుందుడు బయటకు వెళ్ళాడు. అసహాయుడల్లే అనుమయ్యా కూడా వెళ్ళాడు. కారిడర్‌లో ఎవరూ లేరు.

"వీడు పచ్చి కేడీ నాన్నా!" అన్నాడు ముకుందుడు రహస్యంగా. దాన్ని తరిఫీదు చేశాడు. దానిచేత ఆడిస్తున్నాడు, కనిపించటంలా?"

"అయితే మటుకు మనం ఏం చెయ్యగలం?" అన్నాడు అనుమయ్యా.

"పోలీసుకు రిపోర్టు చేద్దాం."

"పోలీసులేం చేస్తారురా? వాడన్నట్టు అది మేజరు. నలుగురిలోనూ నవ్వులపాలు కాకుండా బయటపడే మార్గం చూడాలిగాని" అన్నాడు అనుమయ్యా.

ముకుందుడు కొంచెం ఆలోచించి, "పోలీసులకు చెబుతామని దాన్ని బెదిరించి చూస్తామా?" అన్నాడు.

"నీ యిష్టం. ఏం చేసినా సరే! నాకు మతి మతిలో లేదు" అన్నాడు అనుమయ్యా.

ముకుందుడు గదిలోకి తొంగిచూసి, "చంద్రీ, ఒకసారి ఇలా వస్తావా!" అన్నాడు.

"రాను" అన్నది చంద్రావతి

"మీరు కావలిస్తే మాట్లాడుకోండి!" అంటూ కుశా గ్రావు గదిలోనుంచి బయటికి వెళ్ళాడు.

అనుమయ్య కూడా లోపలికి వచ్చినాక ముకుందుడు తన చెల్లెలితో "చూడు చంద్రీ! నిన్ను పిచ్చిదాన్ని చేసి అతను ఆడిస్తుంటే నువ్వు ఆడుతున్నావ్. అదేమీ బాగు లేదు. నువ్వు ఇంటికి వచ్చెయ్యి. నీకూ, అతనికీ పెళ్ళి చెయ్యాలన్నా అతని తండ్రికి రాసి జవాబు తెప్పించాలి గదా! ఇది ఒక్కరోజులో అయ్యే పని కాదు, ఇంటికిపోయి ఆలోచించుకుందాం!" అన్నాడు.

"అదంతా కుదరదు. ఆయన్ను బతిమాలో, కాళ్ళు పట్టుకునో పెళ్ళికి ఒప్పించండి. నాకు మీ వేషాలు చూస్తున్న కొద్దీ వాంతి అవుతున్నది."

"నీవు అట్టే మొరాయించావంటే నాన్న పోలీసు లను పిలిపిస్తానంటున్నాడు. కన్నుపోయినంత కాటు కెందుకు? రా!"

చంద్రావతి తోక తొక్కిన తాచల్లే అయి, "పోలీసుల్ని పిలవండి. మేము అదివరకే మొగుడూ పెళ్ళాం అయినామని చెప్పేస్తాను. తలగొట్టి మోస్తారా?" అన్నది.

ఇంకా లాగితే తెగుతుందని తెలుసుకుని ముకుందుడు "పోలీసులతో అబద్ధం చెప్పటానికి కూడా సిద్ధపడుతు న్నావా?" అన్నాడు.

"అబద్ధమో, సబద్ధమో నువ్వు చూశావా?" అన్నది చంద్రావతి.

ముకుందుడు నోరు తెరచి మళ్ళీ మూశాడు.

"ఇంతకూ మమ్మల్ని ఏం చెయ్యమంటావే?" అన్నాడు అనుమయ్య.

"ఆయన దగ్గర మీ బెట్టు మాని బతిమాలి పెళ్ళికి ఒప్పించండి. నువ్వూ, అమ్మా, అన్నయ్యా ఆయన్ను గురించి అనుకున్నదంతా ఆయనకు తెలుసు. మీ మీద ఆయనకు మండిపోతున్నది" అన్నది చంద్రావతి.

"అదంతా ఎవరు చెప్పారూ?"

"ఎవ రేమిటి? నేనే చెప్పాను."

"ఓసి నీ జన్మ చెడా!"

అనుమయ్య ఏదో నిశ్చయించుకున్నవాడల్లే బయటికి వెళ్ళాడు. రిసెప్షన్ దగ్గిర నిలబడి గుమస్తాతో మాట్లాడుతున్న కుశాల్రావుతో "ఏమోయ్!" అని అతన్ని తీసుకుని తోటలోకి వెళ్లాడు. అక్కడ వాళ్ళు అయిదు నిమిషాలే మాట్లాడుకున్నారు.

అంతసేపూ ముకుందుడు గదిలోనే ఉన్నాడు. మధ్యలో అతను లేవబోతే, "పానకంలో పుడకలాగా నువెందుకులే కూచో" అన్నది చంద్రావతి.

అనుమయ్యా కుశాల్రావూ లోపలికి రాగానే ముకుందుడు వారిద్దరి మొహాలూ చూశాడు. కుశాల్రావు మొహంలో ఏమీ మార్పు లేదు. కాని అనుమయ్య మొహంలో విజయగర్వం కనిపించింది.

* * *

కమలమ్మ ముళ్ళమీద వున్నది. తొమ్మిదిన్నరకు అనుమయ్యా, ముకుందుడూ తిరిగి వచ్చారు. వాళ్ళ వెనకనే చంద్రావతీ, కుశాల్రావూ రావడం కమలమ్మ కనిపెట్టింది. ఆమె తన మనస్సును కుదుటబరుచుకోవాలో, గుండెను వేగంగా పరిగెత్తించాలో చప్పున నిశ్చయించ లేక పోయింది.

అనుమయ్యా, కమలమ్మా వంటింట్లో ఏకాంతంగా మాట్లాడుకున్నారు. అనుమయ్య జరిగినదంతా చెప్పాడు. అంతా విని కమలమ్మ "అవ్వ! పెళ్ళికి ఒప్పేసుకున్నారా? ఏమంత గండగత్తెర వచ్చిందంటా? పోనీ నాతో మాట మాత్రం చెప్పకూడదూ? అన్నీ ఇటువంటి పన్లే చేస్తారు" అని ప్రారంభించింది.

"నీ బోడి సలహా ఎవడిక్కావాలి? నోరుముయ్!" అన్నాడు అనుమయ్య.

ఇంతలో ముకుందుడు లోపలికి వచ్చి, "నాన్నా, వాడు ఏమంటున్నాడో తెలుసా? పెళ్ళి కాగానే తనకూ,

చంద్రికీ కలిసి జాయింట్ లైఫ్ పాలిసీ తీసుకుంటాట్ట! తరవాత దాన్ని హత్యచేసి ఆ డబ్బంతా కాజెయ్యటానికి!" అన్నాడు ఆదుర్దాగా.

"ఏడిశావులే! నీ వెధవకబుర్లు వినే ఇంతదాకా తెచ్చుకున్నాను. అధిక ప్రసంగాలు కట్టిపెట్టు!" అన్నాడు అనుమయ్య.

యుద్ధరంగంలో విజృంభించిన అర్జునుడి మనస్సు లాగా వున్నది అనుమయ్య మనసు.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA113B113 |
| పుస్తకం పేరు | కొత్త అల్లుడు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 123 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 1,2 |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Thasin |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |